సీ. పరమభర్తృవ్రతాపావిత్ర్యపేటిక
జనులయాయువుఁ దెల్పు మినుకుచుక్క
సప్తర్షిమండలాస్థానికాదీపిక
యతివరూపముఁ గొన్న యచ్చవెలుఁగు
ఏనస్సపంకకర్బురీనీరకతకంబు
నీలువాంద్రుర తల మేలిపువ్వు
మూర్తిమద్వేదసమూహతత్త్వశ్రేణి
ముగురుతల్లుల మీఁద మిగులు తెలివి
యంగనాజన్మచారితార్థ్యాచరణము
నవయవంబులు గన్న పుణ్యముల ప్రోవ
రుంధతీదేవి యే మునీంద్రుని గృహంబు
వెలుఁగు వచ్చె వశిష్ఠుఁ డా వెలుఁగు వెలుఁగు

చ. సరగున వెంట మానిపరిషత్ప్రథమాసనయోగ్యుఁ డుగ్రసు
స్థిరమతి వామదేవుఁ డరుదెంచెను లేచి సభాసదుల్ ధరా
వరుఁడును మంత్రులున్ మునులుఁ బాద్యము లర్ఘ్యము లిచ్చి తన్పి త
త్పరమపుటాజ్ఞఁ గైకొని సభాగతవేదు లలంకరించుచున్

గీ. అంత జాబాలి వచ్చె సుయజ్ఞుఁ డరుగు
దెంచెఁ గాశ్యపముని యరుదెంచె నంత
రాజునకు నాప్తు లా మునిరాజులకును
నొగి సమర్ఘ్యము లిచ్చి కూర్చుండఁబెట్టి

చ. ధరణితలంబునందుఁ బ్రభుతన్ వెలయించిన వొక్కసారిగా
గురుతరగోనిధానములు కోమలకాంతులు దీప్రముల్ దివా
కరకిరణంబులున్ మనువుగా మొదలైన కులంబు జ్యోతిరు
ద్ధురమతులైన మీ వెలుఁగుతో వెలిగించిరి ధాత్రి మానవుల్

చ. ఇనకరసంతతిప్రతతి కించుక సాగని లోప మున్నదే?
మనుకులసంతతిప్రతతి మాయెడ సాగని లోపభీతి క
ల్గినది భవత్తపోబలము కేవలరక్షగ నున్న మాకులం
బున ననుఁబట్టి లోపమని పుట్టఁగఁజేయకుఁ డంజలించెదన్

క. పుత్త్రార్థ మశ్వమేధము
సత్త్రం బొనరింతుఁ గల్పసరణిఁ బటుతరా
మిత్త్రాఘక్షతి గలుగఁగఁ
బుత్త్రులఁ గలిగింతు వంశమున్ వెలిగింతున్

ఉ. ఊఁదిన యోగనిష్ఠులయి యుర్వికి మీరలు మూలకంబముల్
పాదులు పెట్టినట్లు నిలువంబడి రంతన మీఁదునాజ్ఞలన్
గాదని యల్లబ్రహ్మయును గాలిడ లేఁడు దయాప్రసార రే
ఖాదృతిఁ జూడుఁడీ క్రతువు సాంతము సేయుఁడి యాప్తబుద్ధులై

చ. తతమహిమంపుఁ బ్రోవయిన తాత! వశిష్ఠ! సమాదరింపు దే
వతలకు బ్రహ్మవోలె మనువంశపు ఱేండ్లకు నీవుగా పురో
హితుఁడవు మున్ దిలీపునకు నిచ్చిన నందినివోని యీమహా
క్రతుఫల మిచ్చి నాకుఁ బ్రసరన్మనువంశముగాఁగఁ జూడవే

క. చేతోజార్ద్రాతులు వి
ద్యాతరుణీప్రాణనాథు లావిర్భూత
జ్యోతిష్కులైన మీదు మ
హాతపములు మాకు నిప్పు డండగ నిలుచున్

క. అహిమకరద్యుతిసంతతి
దహదాత్మజ్యోతిరుగ్రధామనిధులు భ్రూ
విహరదమృత లేఖులు మీ
మహిమజలధు లిట్టె పొంగి మము రక్షించున్

క. సర్గపురాకాలజగ
న్నిర్గమనప్రాక్సనామనీషాంతస్సం,
సర్గకరణపృథుసంక
ల్పార్గళములు లేని వెలుఁగు లవి రక్షించున్

శా. అంచుం బల్కెడి ధారణీశ్వరుని ధర్మాధీనచేతంబు వే
ద్యాంచద్వస్తువినిర్ణయోగ్రధిషణాతాత్పర్యమున్ సమ్మదో
దంచత్పూరము నింప నాత్మలను గాఢాహ్లాదులై యేమియున్
మించన్ లేదు ప్రజన్ ఘటించెదవు సుమిత్త్రా! నీవునున్ భూమిపా!

ఆ. అయిన నశ్వమేధ మాచరింపుము శుభ
ప్రాప్తిహేతుభూత మశ్వమేధ
మదియు వేయిపుత్రు లందించు ఫలమిచ్చు
నట్టె యొక్కసుతుఁడు పుట్టఁడెట్లు?

వ. అని తక్కిన ఋషు లనుచుండ నారంజోతిప్రియజ్యోతి

ఉ. నాయన! యశ్వమేధము నొనర్పు గరిష్ఠ సుమంత్రకృష్టి నా
రాయణుఁ డెచ్చెదర్ హవిసు నందగ నాపయి నీయదృష్టరే
ఖాయతిఁ బుత్రుఁడుర్ గలుఁగుగా పసితల్లియుఁ గోసలేంద్రక
న్యాయువతీశిరోమణి మహాసుకృతంబుల పంట పండుగా

వ. అంచు నేత్రమధ్యభాగార్ధోన్మీలనంబును నేత్రాంతవిస్తారతయుఁ గా
ఫాలభాగంబు తేజంబుపుంజంబుగా సమాధిగతుఁ డైనట్లు తోఁచిన

క. పతి సంభ్రమచకితుఁడు ముని
పతి పాదములందు వ్రాలి బాష్పాసార
ప్లుతిఁ దాత! తాత! నీవా
క్కు తిరుగనేర దది యంతకుర్ బటువగుటర్

క. నీ వన్నమాట యజధర
ణీవిభుఁడే బ్రదికియుండెనే విని తా నే
మావాఁడో? యిందుమతీ
దేవియు నాపసిదినాల దివిఁ జేరెడిదో!

గీ. గుమ్ముగాఁబడి పాదయుగమ్ము వదలి
పోవని యిలేశు మెల్లన లేవఁదీసి
మునిజగత్పతి మైత్రావరుణి ధరాప
తిం గవుంగిలించి యెద హత్తించుకొనియె

ఉ. చూచెడివారి కెల్లఁ బతి సొంపుగ నర్వదివేలయేండ్లవృ
ద్ధై చనువాఁడుగూడఁ బడుచైై పసివాఁడుగనై కనంబడెర్
రాచిన వెల్గుప్రోవు మునిరాజుకడర్ బతి చిన్నిదివ్వె యా
చూచినవారు చూచ్చి రిరుజోతుల యెక్కువతక్కువల్ సరిర్ ౧౧౧

క. మునిపతియును జనపతి పూ
నిన గాదిలికౌఁగిలింత నిడుపులయిన యా
మునిపతి జనపతి గడ్డము
లను బడి ప్రమదాశ్రుతతి తళాతళ మెఱసెన్

క. కడమమునులెల్లఁ గన్నులు
తుడుచుకొనుచు రాజుఁగాంచి తురగము వదలం
బడుఁగాక సిద్ధపఱుపుఁడు
జడనుపడకయుండ సర్వసంభారమ్ముల్

మ. కలికిన్ వేసిన బండకొయ్యలవలెన్ గన్పట్టు వేలక్షకో
టులుగాఁగన్ సరయూర్ఘురోత్తరపుటొడ్డుంబట్టి యూపంబు లా
తొలినాళ్ళన్ భవదీయవంశమణిభూతుల్ భూపతుల్ యజ్ఞక
ర్మలు గావించిన శాసనంబులయి యో క్ష్మానాథచూడామణీ!

ఉ. అచ్చట యజ్ఞభూమి కనువైన ప్రదేశము నీదుమంత్రులం
బుచ్చుము. పుణ్యపుందలఁపు పుట్టినయప్పుడె కార్యరూపమం
దచ్చుపడంగఁజేయవలె నాపయి నేదొ వికల్పమందినన్
లొచ్చగు హెచ్చగున్ దలఁపులోఁ బనిదీర్చుట యత్తమంబగున్

వ. అని మును లనుచున్నంత రాజు మంత్రులం దిలకించిన

సీ. ధృష్టికి దృష్టిలో దృష్టి లేదాయెను
గనులు పట్టవు జయంతుని గనంగ
నానందజనితదర్పాంధుఁడు విజయుండు
సిద్ధార్థకుఁడు రససిద్ధయోగి
యర్థసాధకుఁడు ముక్తార్థప్రయత్నుండు
తా నశోకుం డశోకాననుండు
మంత్రపాలుఁడు సర్వమంత్రనిర్ముక్తుండు
మఱి సుమంత్రుండె సుమంత్రుఁడయ్యెఁ
బార్థివేశుఁడు సర్వసంభారములను
గూర్చుఁడీ! పుష్పకుంకుమాభ్యర్చితమ్ము
సర్వలక్షణోపేత మశ్వమును వదలు
డా! మునీంద్రులయాజ్ఞల ననుమతించి ౧౧౮

చ. సరయువు నుత్తరంపుదటిఁ జక్కఁగఁ దీరిచి యజ్ఞభూమిగా
విరచనసేయుఁ డెల్ల పృథివిన్ సమమౌనటు లెత్తుపల్లముల్
సరిపడఁజేయుఁడీ! చదునుసల్పుఁడి! దిమ్మిసల్పన్ మదించి భా
స్వరమృదుశాద్వలంబు గల పచ్చని పెళ్ళలు కప్పఁ డెల్లచో

ఉ. అల్పముగాని యత్నమున నన్నియు సిద్ధము సేయుఁడీ! యథా
కల్పముగాఁగ శాంతులును గావలె శ్రద్ధ వహింపుడీ! క్రుధా
జల్పులు బ్రహ్మరాక్షసులు శాస్త్రవిదుల్ తఱివేచి ఛిద్రముల్
తల్పులుఁబోలెఁ జొచ్చుకొని తత్ఫలమున్ హరియింతు రెంతయున్

క. అపరాధము పుట్టఁగరా
దపరాధిని గర్తఁ జంపు యజ్ఞపురుషుఁ డె
ల్లపనుల యందున మీరలు
నిపుణులు మత్సర్వకార్యనియతులు మీరల్

క. అని విశ్వాసము సంభా
వనయును దీపింపఁ బలుకు వసుధేశునియం
దున ద్విగుణీకృతభక్తిపి
శునవక్త్రు లమాత్యు లగుచుఁ జూచుచు నిలువన్

చ. నరపతి మాటలన్ విని మనంబుల హర్షములంది రాజుచే
విరచితపూజులై చనిరి విశ్వనుతుల్ మునిరాజు లంతఁ బృ
థ్వీరమణుఁ డెల్లమంత్రిసమితిం గని యిట్లనిపల్కె లోచనాం
బురుహయుగంబు రేకు లఱమూత వడన్ జెఱునవ్వు వెన్నెలన్

గీ. వెదుకఁబోయినతీవ దవిలెను గాలి
కందు రపు డేమి సేయుదు రల్లతీవఁ
ద్రెంచి తెచ్చి యౌషధము వండించుకొనుటె
మిగిలినది భిషగ్రత్నముల్ మీరుసూడ

వ. అని యెల్ల సభాసదుల వీడ్కొలిపి

ఉ. ఇంచుక దూరమయ్యె రథ మెక్కి సుకేతనకింకిణీక్వణా
భ్యంచితరావముల్ దనదు నాగమనంబు నెఱుంగఁజేయఁ దే
రంచున దూఁకెఁ గోసలధరాధిపకన్యక మేడముందు వ
స్త్రాంచలపాళి రివ్వుమన నంగలతోఁ జనె మేడలోనికిన్ ౧౨౪

మ. కని కౌసల్యను నీవు వింటివటవే కళ్యాణి! నారాయణుఁ
దనమంత్రంబు బలంబుపేర్మిఁ బిలుచుఁ దానై వశిష్ఠుండు నా
పొనరించుఁ హయమేధమందు హవిసుఁ బొందంగ నీపేరు చె
ప్పెను నీదౌకడుపుఁ ఫలించునని చెప్పెఁ దాత సంత్రాతమై

ఉ. కన్నుల నత్తరుల్ బుగులు కాటుకఁ బెట్టుము పైడిచీర తె
న్నెన్నియొ పెట్టెఁదీసి ధరియింపుము నచ్చినవాని నెల్లఁ గ్రొం
జెన్నుల భూషణాలిఁ గయిసేయుము పుత్రహవిఃప్రదానవే
ళ న్నినుఁ జూడఁగా నదితిలాగున శ్రీహరి యెంచఁగా వలెఁ

క. ఇపు డేమఱకుము హరి లో
భ పెట్టవలయు మనకడుపుపంట కతనిరా
క పదింతలు ఫల మిచ్చెడు
సుపరీక్షితమార్గమెల్లఁ జూడఁగవలయుఁ

చ. అను పతిమాటలం దనిసి యాయమ వెన్నుఁడు వచ్చునేని యా
మునిపతి తెచ్చునేని నవభూషలుఁ జీరలు దాల్చి యెంత వె
న్నుని దనియింతు నాదగు కనుంగొన లొత్తిన బత్తిఁ జూచి మ
న్ననఁ బొనరింపఁగా వలె సనాతనుఁ డాద్యుఁ డటంచుఁ బల్కఁగన్

క. ఎఱుఁగనిదానవా నీకుం
గఱదలు సెప్పంగ ననుచుఁ గదలి యిలేశుం
డఱిముఱి సుమిత్రమేడకు
నెఱకలు కట్టుకొనినట్టు లేగె నడచుచుఁ

ఉ. ఓసి సుమిత్ర! నాయెడద నూహ జనించిన దశ్వమేధయా
గానమకర్మచే సుతుల నందెద నంచును మానులెల్ల నే
బాసని రద్భుతంబు ఫలవంతము యాగ మటంచుఁ జెప్పిరిఁ
గోసలధారణీశ్వరుని కూఁతునకుఁ సుతలాభ మంచునుఁ

క. నీకును బుత్రులు కలిగెద
రాకాంక్షల వెంటఁ బడియె యరుగును ఫలముల్
నాకడుపు సర్వవిధముల
వేకాయలు గాయఁ జూడవే నిపుణమతీ! ౧౩౨

గీ. దీక్షఁగైకొని వ్రతయుక్తి ధృతమనోవి
నిశ్చయాత్మవు సుతుకోర్కి నెగడెదేని
ఫలముఁ గందువు పొలములో వాన యొక్క
చెక్కఁగుఱిసి వేఱొకచెక్కఁ జుక్కపడదె!

చ. అనిన సుమిత్రయున్ బ్రహసితానన పట్టపురాణి కక్కఱున్
దనయుఁడు గల్గు టొక్కటియు నాకును గల్గుట యొక్కటా? భవ
త్తనయుఁడు నీదు భార్యలకుఁ దాఁ దనయుండె యగున్ గదా యటై
నను నిను మెచ్చఁజేయఁగను నాకును సంతతిఁ గోరెదన్ బ్రభూ!

చ. కనుకని తా సుమిత్ర చిబుకంబును గల్లము నల్లఁ దాకి ధా
రుణిపతి కేకయాత్మజ గరుత్మదుదారమణిప్రవాళసా
ధనికర మేగి యోసి వనితాజనతామణి! యశ్వమేధమున్
బొనరుప నిశ్చయించితిన పుత్త్రులు గల్గఁగ పున్నె మేచఁగన్

క. మాను లనుమతించిరి దీ
క్షానిధివై వ్రతముఁబూనఁ జను నీకన నా
తో నేమగు నా కోసల
భూనాయకసుతకు మొదటఁ బుట్టఁగవలయున్

ఉ. అవ్వనితాశిరోమణికి నాత్మజుఁ డుండిన దివ్వె వెంబడిన్
దివ్వియగాఁగ మీకులముదీధితి వెల్గు ననంగ రాజు లే
నవ్వున నౌనులెమ్ము మునినాథులు నిర్ణయముం బొనర్చినా
రవ్విషయంబు నీవును సుతార్థిని వౌటను దీక్షయొప్పగున్

ఆ. ఎన్నితరువు లున్న నన్నియుఁ గాయంగఁ
బూటఁ బూట వేచుఁ దోఁటమాలి
కడుపు నీదికూడఁ గాచిన నాగుండె
యటమటించు టాగి హర్షమొందు

వ. అని తేఁడరిగిన నా ముప్వురు గృహీతదీక్షాస్ఫురితతనూవల్లికలై
యంతఃపురంబులు వెల్గించిరి

శా. సౌధాగ్రంబున నెక్కి తేఁడు సరయూస్వచ్ఛాపగాపూరభూ
పాథోవల్గదుదారచంద్రకిరణప్రౌఢప్రభావీచిధా ౧౪౦

రాధోరణ్యుపనీతసద్రజతనీరప్రత్నకాంత్యుగ్రసం
బాధశ్రీపరితర్పితాత్ముఁడయి శోభాదర్శనైకాగ్రతన్

సీ. క్రతుయత్న మెంతదూరము వచ్చెనో చూడ
వెల్లేన్గు వజ్రి పంపించెనో కా
యజ్ఞాగతునకు నారాయణునకు ము న్గ
దలి పాంచజన్యంబు తరలెనో కా
యాగఫలంబైన యమృతకుంభము మింటఁ
దెరలి ప్రాగ్దిశ బయల్దేరెనో కా
మైత్రావరుణి ప్రేమమంజులాశీర్వాద
వల్లిక తలపూవు వదలెనో కా
యష్టతనువుల హోత్రి యైనట్టి తనువు
తోడి రుద్రసంరంభవిభూతి చెదరి
ముందునకుఁ దూఁగెనో యన నిందుబింబ
మల్లఁ బ్రాచి బారెడుపైని హాసులొలికె

క. తనుఁగాంచి పొంగు భూపతి
మును నిలువఁగఁ జంద్రముండు మూర్తిఁగొని వ
చ్చెనొ యనఁగ సుమంత్రుఁడు ని
ల్చెను భూపతియెదుర శ్వేతసిచయధరుండై

క. తన వెలుఁగు లెల్లమును నా
తని కులపతి యిచ్చునట్టి తళుకెగదా యం
చని చంద్రుఁ డతని ముందట
చనుదెంచె ననంగ మంత్రి సవినయుఁ డయ్యెన్

చంద్రకళ.
మున్ను విన్నది దేవరహస్యంబున్ దమకున్ వినిపింపఁగా
నెన్నొ స్వార్థ తలంచితిగానీ యేను వచింపనె లేదు నేఁ
డెన్నఁ జెప్పకయున్న ఫలం బొక్కింతయు లేదు ధరాధిపా!
మున్ను దేవయుగంబున వింటిన్ భూప! భవత్సుత హేతువున్

క. అని చంద్రకళలు విరిసిన
వనఁ బల్కిన మంత్రిఁగని రహస్యంబా? ౧౪౫

న్నను మఱుఁగుపెట్టి యిన్నా
ళ్ళును దాఁచితి వేటికీ ప్రలోభము మంత్రీ!

ఉ. ఎయ్యది యొప్పు దాఁచవలె నెయ్యది యొప్పు వచింపఁగావలెన్
గయ్యాలు కోయు టెందొ? యధికంబుగ నొండులు పేర్చు టెందొ? నీ
వయ్యమరాపగంబలె మహాప్రభుబుద్ధివి దాని జెప్పుమా
య య్యతనంబు సేయుదము సాద్భుతమంత్రవినిర్ణయాకృతీ!

క. అను జేని ప్రశ్రయంబున
కును గొంచెము కదలి రాజగోపాలక! నా
వినినది చనినది యొకటియ
చనినది నీ వెఱుఁగుదువును జారులవలనన్

ఉ. అంగము లేలు భూమిపతి యాత్తసుహృన్మతి రోమపాదుఁ డే
లంగలయూళ్లు బెట్టయి యిలాపతి ధర్మగతిన్ వ్యతిక్రమ
మ్మొం గలుగంగ వర్షములు పుట్టకయుండిన యంత సంగముల్
చెంగలులై చెడెన్ జినుకు చిక్కిన పాపమునందుఁ బోవకే

సీ. మాగాని పరశురామప్రీతి యైనట్లు
మొలకనారులె యొజ్జతలలు వేసె
మెట్టచాలుల విత్తు పెట్టకమున్నె చు
మ్మలుచుట్టి మలమల మాడిపోయె
ఊటలూరెడి సెలయేటి మేల్వారవలు
నెండిన బుగ్గలై యింకిపోయె
బావులలో నీరు వట్టి పూడికఁదీయ
మున్ను పుట్టిన జల మిన్నుపట్టె
పాడియావుల చన్నులు పట్ట నెత్రు
ధార లోడిన జనులు హాహారవముల
రాజు మొగసాల నిలచి మొఱ్ఱ లిడినంత
విభుఁడు నేడ్చుచు వారిఁ జేవిసరి పంపి

క. హితులను మంత్రులను బురో
హితులను గనుఁగొంచు మీర లీ బెడదయు నే ౧౫౦

గతిఁ బాయవచ్చుఁ జెప్పక
మతి నిలువదు నాకు నింతమంది వగలచే

క. ఒకచోటఁ గుఱుపు మం దిం
కొకచో నన్నట్లు పాప ముర్వీపతిదిక్
వికృతపుబాములు ప్రజలవి
యకటా ! యీబాము లెట్లు లపహృతము లగున్

వ. అని పురోహితులం జూచి

క. మీరలు శ్రుతధర్మములు లో
కారాధ్యులు నాత్తధర్మ లఖిలఘునజగ
చ్చారిత్ర వేదు లీశ్వరు
లీరాజ్యమ్మునకు మీర లే గతి నాకున్

శా. ఆయెంబో యొకజీఱ చిర్మోగిలు రా దాకాశవీధిన్ బరి
స్ఫాయ త్తీవ్రకరోష్మచేఁ బగిలి భూభాగమ్ము బీటుల్ వడెన్
నా యీ భూప్రజ కేమిసెప్పుదు నవంధ్య మ్మెా యనావృష్టి కే
ప్రాయశ్చిత్తమొ చెప్పుఁడీ యదియు శీఘ్ర మ్మెను గావించెదన్

గీ. అని ప్రలాపించు రాజు నూరార్చి ద్విజులు
త్రోవ యొక్కటె కల దది దుర్ఘటంబు
నేము పూర్వమె చెప్పఁబోయెదము గాని
చేయఁగ నసాధ్య మని దానిఁ జెప్ప లేదు

వ. మహాతపస్వియగు కాశ్యపునకు విభాండకుండు పుట్టె; నవ్విభాండకు
నకు ఋశ్యశృంగుండను కుమారుండు కలిగె; ఆ ఋశ్యశృంగుండు
విభాండకుని కన్నులకు వెన్నెలవత్తి; తండ్రి యాయన నట్లు పెంచె

చ. అతనికి లోకమే తెలియ దగ్నియుఁ దండ్రియు నిద్ద రే జగ
మ్మతనికి బ్రహ్మచర్య మిపుడైనను నట్లె ద్విధాగతిప్రసా
రితముగఁ బొల్చు నవ్వనిఁ జరించును మూరపుఁడోఁట పోఁడు లో
భితమతి కాఁడు స్త్రీ పురుషభేదము కూడ నెఱుంగఁ డింతయున్

క. మూఁడవమానిసి నెఱుఁగఁడు
నాఁడుది యెన నేమొ యెఱుఁగఁ డంతకుమున్నే

పోఁడిమి వనిఁ జని తెచ్చిన
కాఁడలు సమిధలును బండ్లఁ గాయలె యెఱుఁగున్

సీ. తండ్రికన్నను ముందుఁ దానె మేల్కని యగ్ని
హోత్రమ్ము సరిచూచి యుమకఁ బెట్టు
తండ్రికన్నను సముద్యద్ఘోష మేపార
నర్ధ్చలును ఋక్కు లనువదించు
తండ్రికన్నను సమాహితశ్రద్ధమై యుష
ర్బుధున కర్పొహవిర్బుధ్నము * లిడు
తండ్రికన్నను నిశ్చితజ్ఞానదృఢబుద్ధిఁ
బితృసమర్చాధురాప్రీతిఁ గాంచు
నతఁడు పుంరూపబ్రహ్మచర్యంబు శ్రద్ధ
ప్రోవు నెల్లప్రాయశ్చిత్తరూప మతఁడు
వాని నాషాఢమేఘము వోనివాని
నిటకుఁ దెచ్చితివే ననావృష్టి తొలఁగు

క. నీతనయ శాంత నొసఁగు మ
యా తబిసికిఁ గదలఁ డిచట నాతం డెన్నా
ళ్లేతావునందు నుండునొ
యాతావున నీతిబాధ యనిలేదు నృపా!

ఉ. ఆ జనకుండు పుత్త్రవిరహంబు సహింపఁడు ఋశ్యశృంగు నే
యోజను దెత్తువో! యతని యున్నవనంబులు దవ్వు నేర్పుతో
రాజ! విభాండకున్ మొఱఁగి రావలెఁ దేవలెఁ గుఱ్ఱమౌని ను
ర్వీజన తాపనోదన గరిష్ఠకళా ప్రతిభాస్వరూపునిన్

వ. అని పురోహితులు విన్నవింప రోమపాదుండు మంత్రులతో విచారించి యదికాదని యిదికాదని పెక్కునాలోచనలు త్రోసి పుచ్చి దారితోఁచక

మ. ఎడఁదన్ భీతులు పొంది మౌనిఁ గొనిరా నెవ్వండు ముందంజ వే
యఁడు; నే బోవను నేను బోవ ననుచున్ హా! హా! యనావృష్టిచేఁ

---

* హవిర్బుధ్నములు = హవిస్సులైన దుంపలు

జెడియర్ మృత్యువు వద్ద నుండియు మునిం జేర్ఱ భయంబంట హా
త్తెడు నేత్రంబులర్ఱ బొరల్ జనులబుద్ధి మాయ యల్లేకదా!

వ. అట్టిసమయంబున రాజునకు వింజామరలు వీచు కుసుమశరకోదండ లస్తకమధ్యలు తత్కార్ముక భ్రూయుగలు తజ్జ్యాతనూలతలు నలువురు వారయువతులు వీచుచున్న చేతు లడ్డముగా నొడ్డుకొని యొకళ్లొకళ్లు కన్గిలుపుకొని వారిలో నొక్కగడుసరి రాజుతో నిట్లనియె

ప్రియంవద.

దివిషదీశ్వరుఁడు తేప మానుల్ఱ
గవురుగప్పుచు పొగల్ వెలార్పఁగా
నవు దపస్సుల మహాగ్ని రేగఁగా
నవుర! యచ్చరల నంపునంటగా

పణవము.

త్వన్మానాథుల్ మఱి మముఁ బంపింపర్ఱ
మానీంద్రుర్ఱ గొని మమతం దెత్తుర్ఱ
తేనుంజాలక ధృతి నే రానే
రా నీ పట్టణరమ సిగ్గిల్ఱ

వ. ప్రభువులు తాంబూలంబు దయసేయించినచో నీ నా చెలిమికత్తెలతోఁ గూడి యిప్పుడే బయలుదేరుచుంటి నన

ఆ. పతియు నచ్చెరువడి వారితో మునిశాప
భీతి మీకు లేదొ భీతహారిణ
నేత్రలార! యన లవిత్రముల్ వోని చూ
పులు నిగుడ్చి మందముగ హసింప

ఉ. నాతుల గుండెనిబ్బరము నచ్చి ధరాపతి పంపె బండ్లపై
నా తలిరాకుబోండ్ల మునిద్దైన తపోవనిఁ జేర వారల్ఱ
తాతినిగూడ మాదు మెయితావు గగుర్పొడిపించు నిట్టటే
చేతము గల్గువారి నిఁకఁ జెప్పు మటంచును గువ్వకోలుగా

క. నవ్వుచుఁ ద్రుళ్ళుచు నోసీ!
నవ్వెక్కువ నీకు మానినాథుఁ డెటేఁగిన్ఱ ౧౨౦

చవ్వాలగుఁ దియ్యఁదనములు
పువ్విలుకానికి నిఁకొక్క ములికియుఁ దఱుఁగున్

మ. కెరలున్ మాని యటందుఁ గిలెజెఁగిరన్ గీడెంచి మేలెంచు మం
దురు కోపంబున నోసి మిమ్ము నెవ రిందున్ బంపినారన్న భూ
వరునిన్ జెప్పకు డేమెవచ్చితి మనన్ బాడౌనో బీడౌనో భూ
వరు చూడాసితకేశమున్ గదల కొప్పంగావలెన్ భామినుల్

వ. అని విభాండకుని యాశ్రమంబున కుల్లయగు ప్రదేశంబున బండ్లు
దిగి యందు విడిసి

క. మునియాశ్రమంబు దగ్గరఁ
జనరా దమ్మౌనికొటుకు చనరాఁడఁట ద
వ్వాన కంచు ద్విజులు పలికిరి
మునితనయుని జూచుటకును మోసంబయ్యెన్

వ. ఇట్లుండ నొక్కనాఁడు ఋశ్యశృంగుఁడు తనతండ్రి తపోవనిఁ జాల
దవ్వు చనినవేళ యదృచ్ఛాగమనంబున దదధిష్ఠితకాంతారాభి
ముఖుండై వచ్చుటఁజూచి వారంద ఱోసియోసి! యని యం
దొకర్తుక వీణయు నొక్కతె మృదంగంబును నొకతుక తాళంబులుఁ
బూని మ్రోయింప నాయకురాలు గొంతెత్తి నాట పున్నాగ
యారభి శ్రీ వరాళిరాగంబులు క్రమంబున నెత్తి కృతులు వర్ణం
బులు పాడినంత

సీ. తన గొంతులోన నూఁగు నినాదము లపూర్వ
నినదితంబులు వచ్చి నిట్టవాడిచి
తన గుండెలోన డాఁగిన మెత్తనగు చోట్లు
భావరూపము లంది పైకి వచ్చి
తన సృష్టిలోన నుండిన క్రొత్తమాధుర్య
సీమలు క్రేళ్లుగాఁ జెంగలించి
తనయాత్మఁ దా నెఱుంగని యొక్క యానంద
పరిధి రేఖాస్వయంవ్యక్తి కలిగి. ౧౭౫

కనుఁగొలుకులందుఁ గన్నీళ్లు గార్చి మై గ
గుర్పొడువఁ దన దేహ మా క్రొత్తబిగువు
లెచటఁ దెచ్చెనో యని కను లింతలుగను
విచ్చి చూచుచు మునికుట్టి బిగువు చెడియె

క. అంతట నవ్వోలఁదుక లై
కాంతిక కేళీక ళారహస్యార్ధనవా
త్యంతధ్వనిమద్గీతా
సంతానము భరతశాస్త్రసరణిం బాడన్

సీ. రాగానుసారి భావాగణ్యగీతిచే
నర్థానుగుణ్యహస్తాప్తిచేత
హస్తానుకారి నేత్రాపాంగరోచిచే
లక్ష్యానుగాస్యచాలనముచేత
వదనానుకారి గ్రీవాభేదపటిమచే
గ్రీవానుగాంగసంశ్లిష్టిచేత
నంగలాఘవకృతోత్తుంగభంగీనృత్య
కేళ్యనుసారిభంగిమలచేత

గీ. నాటుపొంగులు తరఁగపూ లంబురోచు
లూఁగిసలు మధు రేఖలు నొదిగి వెనుక
కరుగుటలు ముందువచ్చుట లైన నాలు
గంబుధులవోలె వారు నృత్యంబుసేయ

చ. విని విని చూచి చూచి కనువేడుకు తీరఁగ వారిఁజేరి మె
ల్లన నవి మీఁకుటీరము లలంకృతు లే వనసీమ కయ్యెడన్
గనులు చెవుల్ సుతర్పితముగా నొనరించిరి క్రొత్తశాస్త్రముల్
కని విని నేనెఱుంగ నవలన్ వచియింపరు నాకుఁ దంద్రులున్

చ. అని యడుగుల్ స్పృశించి యలనల్లనఁ గౌఁగిలిఁబూని యంతఁ జి
క్కఁసి యొక స్పర్శ-యేచి తనుకంపము పుట్టి యొడల్ బిరాన జి
ల్లనఁ దెలియంగరానిసుఖ మంది యిదేమగు మానులో భవ
త్తనువులు దాఁకఁ జల్లనగుదానికి నెట్టితపంబుఁ జేసిరో ౧౮౦

సీ. మీశిరస్సులజడల్ మేలుగా నునుపుగా
నట్టె ముప్పేటగాఁ బుట్టెనొక్కొ
మీసలు గడ్డముల్ మీ ముఖచిబుకగ
ల్లముల మెలఁగనే మెలంగవొక్కొ
నాకు మొగాన నున్నది యొక్క-కొమ్ము ఆ
మ్ముల మీకు జంటలై పుట్టెనొక్కొ
యెపుడు సర్వాంగాసవపు నిష్ఠచేతనే
పిఱుఁదులు మీకింత పెఱిఁగెనొక్కొ
యనుచు వారల జడలంటు నాననములు
తడుము నురములు తాఁకు ముట్టెడును బిఱుఁదు
లట్లు సేసియు నచ్చోటి కసమశరుఁడు
తొఁగిచూడఁడు ముని ఋశ్యశృంగువంక

శా. భూపశ్రేష్ఠుని కూఁతు పెన్మి టనుచున్ బూజింతుఁ రమ్మాని నా
రూపాజీవలు నాత్మలన్ మునికుమారుం డవ్వారారోహలన్
మీ పర్ణాంగణశాల దూర మొ? ననున్ మీ వెంటఁ గొంపోదురో?-
మీ పుణ్యాశ్రమహోమకర్మలు గనన్ మేలౌను నాగుండెకున్

క. అన వారలు మా యాశ్రమ
మున నన్నియుఁ గనకసౌధములు గల వనఁగాఁ
గనక మనఁగ నేమన భూ
షణములు చూపించి దాని సంగతిఁ దెలుపన్

శా. ఐనం దప్పకవత్తుఁ జూచుటకు మీవౌ నాశ్రమంబుల్ తరుల్
గానీ పండ్లునుగాని యందు నిటులేగా యుండు నన్నం దరుల్
వీనిం బోలియ యుండుఁగాని ఫలముల్ వే ఱవ్వి నీవుం దినం
గానౌ నున్నవి కొన్ని మాకడ నటం చా వ్వారముఖ్యాంగనల్

ఉ. లడ్డు జిలేబు లిచ్చిన బలాఢ్యయని లడ్డులు నన్యబర్హి వౌ
గ్రుడ్లని చూచుచున్ దొడిమఁ ద్రుంచుట తోఁచదు మూతిలేని వీ
బుడ్లనుచున్ జిలేబులను బూని విచిత్రపు టిప్పపూవులౌ
యొడ్లకు మీదు నాశ్రమఫలోన్నతి కల్గునె యంచు మెచ్చుచున్

శా. వహ్వా యంచు జిలేబి లడ్డులను నాస్వాదించి యానందమై
జిహ్వాతర్పణమై పురే యనుచు మీ చిత్రాశ్రమస్థానిలో
బహ్వానందము లింక నెన్నికలవో వత్సా నిజం బేను న
న్నాహ్వానించుట కేదియైనఁ గలదా? యభ్యంతరం బన్న హో

ఉ. అచ్చపలేఢణల్ భరతునాగమ మెల్లఁ బ్రయోగవైఖరిం
దెచ్చినవార లాట నట నేర్చిన బ్రాహ్మణసంప్రదాయముల్
గ్రుచ్చినమాట లేర్చి తమరుం జనుదెంతురొ యాతిథేయ మం
దిచ్చెద మింతకన్న వలెనే చరితార్థుల మమ్ముఁ జేయఁగన్

క. ఆ యే డీ యేడుతరాల్
మాయురె! తరియించు మూడుమంటలు నెగడున్
మా యాశ్రమహోమగవీ
పాయసములు చారితార్థ్యఫణితి వహించున్

వ. అనినంత ఋశ్యశృంగుఁడు తనతండ్రి యుటజంబుఁ జేరు వేళ యైన
దని గ్రహించి

గీ. ఇంతసేపును మీక్రొత్త లేను మఱగి
రండు మాపర్ణశాలకు రండటంచుఁ
బిలువనేలేదు క్షమియింప వలయు రండు
పోద మిపుడు మా యాశ్రమమ్మునకు మీరు

చ. అటు కనుపించు కానుగుల యాదెస మల్లిన నుల్ల యుండు మా
యుటజము తండ్రిగారు మఱియున్ బ్రియమారఁగ నర్ఘ్యపాద్యసం
ఘటనముఁ జేసి మెత్తు రదిగాకయుఁ బెంపుడులేటికూన యొ
క్కటి కల దద్దియున్ బదయుగంబులు నాకు గళంబు సాఁచుచున్

క. మఱి దర్భలు నేఁ ద్రుంచెడు
తఱి నదియును గొఱికిపెట్టుఁ దాతలు దానిన్
జిఱుతుకఁ దెచ్చిరి యదియును
పఱికలు నాచేత నొసఁగవలెఁ దాఁ దీసఁగాన్

వ. దానినిగూడఁ జూడవచ్చు రండనిన నా చకితనేత్రలు

ఉ. మిమ్ములఁబట్టి నిల్చితిమి మేమును బోవలె మాకుఁ బ్రత్యవా
యమ్ములు పుట్టు తత్క్షణమ యార్చవలెన్ జని మీదు నాతిథేఁగార

యమ్మలు మాకు వచ్చె భవదాగమనార్థమ యుండుమందురా
మమ్మల నిందె యెల్లి యన మంచిది మంచి దటంచు నాతఁడున్

క. చని దినము దినము నారే
యును వారలఁగూర్చి యూహ లూహించుచుఁ బ్రా
ద్దున లేచి యగ్నిహోత్రము
లను సేసినఁ దండ్రి వనములం బడి చనినన్

ఉ. వచ్చునొ రాఁడొ! యందునికి భద్రమొ భద్రముకాదొ? యొక్కచో
వచ్చిన వృద్ధమౌని తమపాట్లవి యేమగునంచు ముండ్లపై
నిచ్చలు గూరుచున్నటుల నెవ్వగఁ బొందెడివారిఁ జేరఁగా
వచ్చెను ఋశ్యశృంగుఁడు నబద్ధపుదోసము గల్గకుండఁగా

గీ. పోదమా యన్నఁ బోదము పోదమంచుఁ
గదలి శకటంబుపైని సంగములు సేరి
యచట రాజాజ్ఞ నుత్తమహయయుగంబుఁ
బూనిచిన రథంబున రాజధానిఁ జేర

ఉ. ఆరథ మేగుత్రోవ జలదావళి మింట వినీలకాంతిమా
లారుచిరాతపత్రపరిలంబినియై రథనేమినిస్వన
స్ఫోరకహేతువై యుఱుముచున్ వెనుకన్ దెసలన్ బ్రపాతధా
రారమణీయవాఃకణధురాపరితర్పితదేశమై చనెన్

చ. అదివర కేమియుం దెలియఁ డామున్ని చూచుచుఁ జూచుచుండియే
మది నెఱిఁగెన్ సమస్తమును మానినులున్ బురుషుల్ పురావళుల్
సదనములున్ బొలంబులును సాగులు పంటలు కర్షకుల్ నవాం
బుదములు ధర్మముల్ సహజబోద్ధలు నిశ్చలతత్త్వమానసుల్

ఉ. వర్షముతోడ నొక్కపరి వచ్చిన మానిని రోమపాదుఁడున్
శీర్షక మా పదాబ్జములఁ జేరిచి రాజ్యము నీది నీవు రా
హర్షము వర్షమున్ గలిగెనయ్య! మదాత్మజ నిత్తు ఋశ్యశృం
గర్షికి నీకటంచుఁ దనకన్నియ శాంతను బిల్చి చూపఁగన్

శా. లజ్జాముగ్ధముఖారవిందఁ గని యా లావణ్యపాథోధిఁ దా
నజ్జామాతయు లజ్జయొత్తిడి మొగం బల్లంత వాల్పన్ బురే! ౨౦౧

మజ్జారే! పురికిన్ వనంబునకు నీమాత్రంబు భేదం బటం
చజ్జల్ప్రోవులు వారముఖ్యులు సురంటంటించి గెంటించుచున్

వ. పరిహాసంబులు సేయువేళ వారిర్వురకు రాజు వివాహంబు సేసెఁ; శాంతరుష్యశృంగులకుఁ బుత్రసంతానంబుఁ గలిగె; నిది మున్ను దేవ యుగంబున సనత్కుమారుఁడు ఋషులతోఁ జెప్పనెడ నేను విన్న సంగతి, ఈ కథఁజెప్పి యా మహర్షిసత్తముండు శంసామార్గమున ఋశ్యశృంగుఁడు మీకు నల్లుఁ డగుననియు వాని మహత్త్వమునఁ బ్రాంశుతనులు వీర్యవంతులు నగుసుతులు నీకుఁ గలుగుదు రనియుఁ జెప్పె

క. ముని ఋశ్యశృంగు నిచటికిఁ
గొనిరావలెఁ గ్రతువు సేసికొనుటకు మున్నే
మనుజాధిప! వనజాధిప
ఘనవంశమణీ! త్రియీశిఖాబుద్ధిధునీ!

వ. అని మంత్రి విన్నవించినంత

సీ. ఒనర బోర్కాడించి యుయ్యేలతొట్టెలోఁ
బండఁబెట్టిన పసిపాపవోలె
వీధులంబడి తిర్గి బూదియ మైఁ జల్లు
కొని పర్వులంబెట్టు కుఱ్ఱవోలె
నన్నమ్ముఁ దించు మోమంతయుఁ బెరుగన్న
మును జేసికొన్నట్టి బొట్టెవోలెఁ
జిట్టి! తలంటిపోసెద నన్న నందక
తొలఁగి పర్వులువెట్టు నులిపివోలె
వెల్లదుస్తులు కట్టించి వీధులన్ షి
కారు పంపిన రాజకుమారువోలె
మింట నడుచుక్కి జాబిల్లి మేదినీశు
నేత్రములకును జలువఁ బండించిపోసె

చంద్రిక.
కువలయమణ్ణి చిట్టికోర్కులన్ దవిలి శిశిరమూర్తిఁదాల్చి పె
ల్లివము చిలుక మింటికెక్కి నన్ సవియుఁ జెలఁగ నొప్పెఁ జంద్రికల్

చంద్రరేఖ
భూమీభృన్మౌళికాంతుల్ భూషామణిశ్రేణి వెల్గన్
శ్రీమత్కాంతిప్రసారక్షీరోదరత్నప్రవాళో
ద్దామాంశుల్ రాజసౌధప్రాఘిష్ఠగాంగేయకుంభ
గ్రామంబుల్ వెల్గుప్రోవుల్ గాఁ జంద్రరేఖల్ చలించెన్

సీ. చంద్రబింబం బని యంద్రుగానీ వియ
ద్వల్లిఁ గాచిన * చంద్రబాలకాయ
ప్రాలేయకరుఁ డన్న పలుకె కానీ మింటి
గట్టు ‡ నైలావాలుకంబుపండు
సోముఁ డంటయె కాని యామినీశ్రకచక్ర
త్తంబైన † సోమవల్కంబు చెక్క
యమృతాంశుఁ డనుటయే యాకాశకాత్రికో
ద్యానభూషణ ♦ మమృతాఫలంబు
ఏకదేశవర్ణవ్యత్యయైకశస్య
మాత్రవర్ణలోపాగమవ్యాకృతిఁ గొని
పేరు మారెను వీని కన్ బృథ్విపతికి
మంత్రి చిఱునవ్వు నవ్వుచు మాఱుపలికె

వ. మున్ను సనత్కుమారుండు ఋశ్యశృంగుం డధ్వర్యుండుగా నీయశ్వ
మేధంబు పుత్త్రఫలప్రాప్తిహేతు వనియె

శా. హ్రీశ్యామాక్షుఁడు నల్లుమాని యిటు నీయింటన్ వసింపన్ సురల్
వశ్యుల్ గా నయి కోసలంబు బహుకృత్వఃప్రాప్తసస్యం బగున్
శ్రీశ్యామాంబుదమాలికాతతులతోఁ జేరున్ భవద్దేహముల్
భశ్యచోష్యకము పూర్ణవాంఛలుఁగ భూపా! పుత్త్రసంతానమున్

క. భూతరుణీహృదయేశుఁడు
తాత వశిష్ఠులకుఁ దెల్పి తాతముదలతో
వేతరలి పోద మెల్లియ
ప్రాతఃకాలమున మీరు రాణులు మేమున్ ౨౧౧

---

*చంద్రబాల=పెద్దఏలకులు, ‡ఏలావాలుకము=నూగుదోస; †సోమవల్కము=
తెలిచండ్ర, ♦ అమృత = ఉసిరిక,

ఆ. అనుచు మంత్రితోడ నరిగి యష్టే వశి
ష్ఠులకుఁ దెల్పఁగాఁ గడుఁ ముదంబుఁ
బొంది వారు తండ్రి! పో! ఋశ్యశృంగుండు
చిన్నిసుకర * పాల జున్నుగడ్డ

వ. అని వశిష్ఠు లనుమతిం జూపిన

ఉ. ఆ మఱుప్రొద్దుటం బయనమై ధరణీశుఁ డమాత్యులుఁ సతుల్
గ్రామణులుఁ రథంబులు తురంగములుఁ గజపాళితో నయో
ధ్యామహనీయపట్టణము దాఁటి స్వపాలితకోసలంబులఁ
భూమిప్రజల్ ప్రమోదమును బొంది యొసంగిన కాన్క లందుచుఁ

శా. [1]ప్రేష్ఠమ్ముల్ ప్రజమోములం గనుచుఁ దత్ప్రేమఁ గుబాళింప [2]బృం
దిష్ఠమ్ముల్ పొలముల్ గనుంగొనుచు [3]సాధిష్ఠంబులై యుంట బం
హిష్ఠమ్మె చను త్రోవ వేగిరముగా నేగఁ సుమంత్రుండు [4]క్షే
పిష్ఠాశ్వంబులఁదోలఁ గోసలములుఁ వెన్కై ప్రయాణించుచుఁ

సీ. కలవింక చాష కంక శశాద నోలూక
మాకలి కారండవాకులములు
పుష్కరాహ్వ రథాంగ భుజగభు క్కీర వ
నప్రియ కూజితన ర్తితములు
వ్యాఘ్ర హర్యక్ష మృగాదన సబరో
మాచ్ఛభల్ల శివా పృకార్దితములు
పృషత రురు న్యంకు కృష్ణశారై ణశం
బర శశ చమరప్రవల్గితములు
నైన యడవులు గల యద్రు లందునందు
ముగురు భార్యలకును భయమోదములను
గూర్చుచుండఁగ నరిగె నా క్షోణిపుండు
చను చమాత్యు లా యా విశేషములఁ దెలుప.

ఉ. ద్రోణులమీఁద దాఁటిరి నదుల్ చులుకీకృతవారిరాశియా
మానియు యామ్యదిగ్గగనమండలలక్ష్మి మొగంబు వెల్గుచు ౨౧౨

*సుకర = సాధువైనయావు. 1 ప్రేష్ఠము=మిక్కిలి ప్రియము, 2 బృందిష్ఠము=మనోహరము, 3 సాధిష్ఠము = పదిలమైనది, 4 క్షేపిష్ఠము=మిక్కిలి వేగముకలది.

క్కై నెఱచిల్లగింజ యసలారిన గందము వోలెఁ బంకసం
తానము లోపలన్ విఱిచినన్ దెలిజగ్గుల గుమ్మునీళ్లలన్

క. చని యంగదేశములు చే
రినఁ జారులు రోమపాదపృథ్వీపతి కా
యనరాకఁ దెలియఁజేసిరి
మును రఘుపతి రాజధాని ముందై చనఁగన్

మ. ఋషిలోకప్రథమావతారుఁడు జగచ్ఛ్రేణీనిరంతోగ్రక
ల్మషసంక్షాళనహేతుసంతతతపోమాహాత్మ్యపుంజప్రభా
సుషమామూర్తి వశిష్ఠుఁడే నృపగృహస్థున్ గొల్చియుండున్ ననున్
హృషితుండై కనవచ్చునంట సము లేరీ? నాకు ధాత్రీశులన్

చ. ప్రశమితసర్వకాముఁ డిటు భావనసేయుచు రోమపాదుఁ డా
దశరథభూమినేతకును దా నెదురేగ సఋశ్యశృంగుఁడై
మసలి సభార్యుఁడై తనకుమార్తెను శాంతను గూడఁ గొంచు వా
రు సనిన వీరు చన్న యిరుత్రోవలు మేల్మరియాదకోవలై

చ. దశరథరాజు కొమ్మజడదారికిఁ బాదయుగంబునందు ము
న్నె శిరసుఁజేర్చి నాకయిన నేస్తము గావున రోమపాదుఁ డీ
రు సగము నాకు నల్లురది త్రోపువడున్ మునిరాజు లాట నీ
శిశిరదృగంతముల్ దనుపుఁ జెందుత మాయెడఁగూడ నో మునీ!

క. అని శాంతఁజూచి తల్లీ!
నినుఁ గడుపునఁ గాంచినాఁడ నే ననుకొన నా
మనసున ధైర్యం బానదు
తొనుకునొ దత్తాపహరణదోషం బనుచున్

చ. అని యనుచున్న యా దశరథావనినాథుని పాదయుగ్మమున్
గొనఁ జను రోమపాదు నిదిగో యని కంట నదల్చి కౌఁగిటన్
గొని రఘురాజమౌళి మనకుంగల తొల్తటిజన్మమైత్రి యిం
దనుక దొసంగుఁ బొంద దనినన్ దొర లిద్దఱు బాష్పనేత్రులై

శా. ఆకాంతల్ గలచక్కఁ గన్గొనఁగ నత్యాశ్చర్య మొప్పంగ శాం
తా కౌసల్యలు రెండువల్లికల యందం బొప్పఁ గాఁగిండ్లలోఁ ౨౨౮

జేకొనై యొకరొక్కరిన్ విడువ రా చేకల్పులున్ మందహా
సాకారంబులుఁ బ్రశ్నయోక్తులు రహస్యంబుల్ గడున్ జిత్రమై

ఉ. అంతట నందఱుం గలసి యంతిపురిం జని యొక్కరొక్కరిన్
సంతస మందఁజేయ సరసంబుగఁ బల్కుచుఁ బ్రేమగర్భిత
స్వాంతము వెల్లడించుచుఁ బ్రియంబు లెటింగిన కాన్కలిచ్చుచున్
వంతులు తీర్చుకొం చొకరివంక నొకళ్లు రసార్ద్రమూర్తులై

ఉ. తూరుపు రేక లారకయ తోఁటల సామివికాసిసూనముల్
చేరల నగ్నిహోత్రములు సేయఁగ రాఘవరాజవహాళికిన్
గూరిమిఁ దెచ్చి యిచ్చు ననుగున్ సుత శాంత శిరఃపరిష్క్రియా
శ్రీరతి కన్న నా రఘుధరిత్రిపు నగ్నులె పెద్దసేయుచున్

చ. తన నగ లెల్ల శాంతమెయిఁ దాల్చి నిరాభరణాభిరామమో
హనతనుమూర్తియై ముదము నందును గోసలరాజకన్య శాం
తను గృహకేళిబర్హిపరిణామతనూలతఁ గాంచి యామె పో
యినయెడ లెల్లఁ గన్ను లొలయించు నవోత్సుకతానమార్ద్రిముల్

సీ. కౌసల్యయొడిలోనఁ గాని కూర్చుండదు
జడ సుమిత్రయె కాని ముడువరాదు
కైకేయితోఁగాని కైలాగుఁ బూనదు
వారితోఁగాని నవ్వంగరాదు
తనసుతున్ గౌసల్యగనుక ముద్దాడని
చ్చు సుమిత్ర గనుక గ్రచ్చుకొననిచ్చు
కైకేయిగనుక చిక్కని ముంగురులు పాయ
గాఁ దీయఁగా నిచ్చుఁ గరుదులాడి
శాంత కీ రీతి వారితో జగము వారి
తో సకలముగా రోమపాదుండు చూచి
తల్లి చూచి హృదంతరుత్ఫుల్లమోద
జలధులై యొక్కవారము జరిగె నిట్లు

చ. దశరథబుశ్యశృంగులును దాము పరస్పరమున్ బ్రియానులా
పసుఖముఁ బొందుచున్ మునికిఁ బార్థివసత్తముఁ డర్చ సేయుచున్

దశరథనేతకుఁ మునియుఁ దా మృదుగౌరవ మాచరించుచుఁ
గొన కొకరొక్క రాంతరనిగూఢసమార్ద్రమనస్కు లౌటయుఁ

వ. ఇట్లు సప్తాష్టదివసంబు లుండి దశరథుం డొక్కనాఁడు రోమపాదునిం
గని

ఉ. మిత్రయశోనిధీ! తురగమేధము సేయ వశిష్ఠులాజ్ఞ చేఁ
బుత్త్రులు లేని కారణము పొంటెఁ దలంచితి ఋశ్యశృంగు లా
సత్త్రము సాగఁజేయ ఫలసంగతి శీఘ్రమ కల్గునంచు నీ
మైత్రిఫలం బొసంగు మని మానిని యాచనసేయ వచ్చితిన్

శా. నావెంటన్ దయచేసి పంపఁగదె శాంతన్ ఋశ్యశృంగున్ క్రతు
శ్రీవేళన్ గబురంపెదన్ వెడలిరారే నీవు నీమంత్రులున్
నివాల్లభ్యము నీదు నంతిపురియున్ నీ వప్పు డేతెంచి నీ
వే వీక్షింతువు ఋశ్యశృంగులను నం దేరీతిగాఁ జూతునో

వ. అనిన రోమపాదుం డిట్లనియె

క. దైవము రక్షించియొ మఱి
దైవము రక్షింపకయొ కదా పర్యాయమై
తా వచ్చె ఋశ్యశృంగుఁడు
నీవచ్చుటకూడ దైవనియతియ కాదే

క. నీకూఁతు రగుటను న్మను
నా కూఁతురె శాంత? మాని నా కల్లుఁడు ముం
దీ కొంచియమ్ము గౌరవ
మే కొండంతగ వచింతువేలయ్య నృపా!

వ. మఱి ఋశ్యశృంగుఁడో!

శా. శ్రీస్యందాననుఁడై వశిష్ఠులని పేరే చెప్పినన్ గౌరవ
భ్రశ్యత్కేశనిబంధనమ్ము గురుత్రాసంసన్నివీతంబుగా
వశ్యుండై చనుదెంచు వెంటఁబడి నేఁ బంపించు టేమున్నదో
హాస్యంబాగద నీవు నర్థివయి నేనా! దాత నో మిత్రమా!

వ. నాయాజ్ఞ యేమున్నది? కొంచుఁబొమ్మనిన దశరథుండు పరమ
ప్రీతుండై

క. సుఖమో దుఃఖమొ జన్మము
ముఖస్తుతులు గావు నిన్నుఁ బోలు నమృతుఁడై
సఖుఁ డొక్కఁ డున్న నీదృశ
మఖంబు లోకవేయి యశ్రమంబుగ నెగ్గున్

క. అని ఋశ్యశృంగుతోఁ జె
ప్పిన నాయన రోమపాదపృథ్వీపతియా
జ్ఞను శాంతయుఁ దాను నయో
ధ్యను జేరఁగ బయలుదేరి రాసమయమునన్

శా. రథ్యాసంతతి కమ్మగంబురల ధారావారి సంసిక్తమై
పథ్యానందథు వొప్ప ముత్తెములకోవల్ జిల్గులా ముగ్గులై
వీథ్యంతమ్ములు ద్వారతోరణపటీవిస్తారశోభాఢ్యులై
విధ్యాశీర్ముఖభూసురప్రణుతమై వెల్గెన్ బురం బంతటన్

శా. ప్రాంతస్విన్నవిలోచనుల్ దశరథప్రస్థానవేళన్ నృపుల్
సంతోషంబును దుఃఖ మొప్పఁగఁ బరిష్వంగంబులం బట్టుచున్
గాంతల్ వీడఁగలేక యొక్కొకరు నక్కా! సెల్లి! యజ్ఞార్థ మే
తెంతున్ దప్పకవత్తుగా యనుచుఁ బ్రీతిస్నిగ్ధలై పల్కుచున్

శా. శ్రీపూర్ణానన శాంతతోఁ గలసి తోఁచెన్ ఋశ్యశృంగుండు ముం
దై పర్వొత్తు రథంబుపై దశరథుం డావెన్కఁ బోగా నుషః
శ్రీ పద్మాస్యలు రాణు లొక్కొకరు వారిన్ వీరు వీర్వారి నే
దో పల్కుడుచుఁ జాల వెన్కఁబడి యెట్లో సాగిపో నంతటన్

శా. అంగమ్ముల్ సనుదెంచువేళఁ బదినాళ్లయ్యెన్ బ్రయాణంబు వా
రంగమ్ముల్ విడి యిల్లుసేరుటకు నాల్గయ్యెన్ దినంబుల్ హ్రదుల్
హొంగారంగ నయోధ్యలోని ప్రజ లాభూపాలుఁ డేతెంచు వే
ళం గేహంబులు వీథులున్ గొలుప హేలాసక్తలాధూపముల్

శా. త్వన్నాథుండు సుఖంబుగా వినియె శంఖస్వానముల్ దుందుభి
ధ్వానంబుల్ పటహస్వనంబులు సముద్రప్రౌఢకల్లోలమా
లానృత్యంబులుఁ గాఁగఁ బట్టణప్రజల్ మానిన్ విలోకింప భ
క్త్యానమ్రుల్ సనుదెంచి రత్నీయుగశోణాఘాతబాష్పాంబువుల్ ౨౮౫

శా. సౌధాగ్రంబులు దేహళుల్ నతగవాక్షంబుల్ తటిచ్ఛ్రేణిసం
బాధం బేచినరీతి సుందరతనూవల్లీమతల్లీలస
న్మాధుర్శ్రీమృదుమూర్తులై వెలయు వామాదీప్తు లేపారెఁ ద
ద్వీథీతోరణమాలికాతతులఁ దద్వీక్షాప్రభల్ గూర్పఁగన్

ఉ. మానిని గాంచవచ్చి రను మాటయె లేదు లతాంగు లెల్లరున్
మానిని శాంతఁ గాంచి మునిమాటయె విస్మృతిఁబొంది దాని యం
దానికి దానియొద్దికకు దానియదృష్టపు రేఖకున్ దిదృ
క్షానిధులై నిరంతము ప్రశంసలు సేసి రుదాత్తవాక్కులై

మత్తకోకిల.

ఎంత చక్కని చీరఁ గట్టిన దెంతసొమ్ములు క్రొత్తవిన్
వింతలున్ మెయిఁ దాల్చికొన్నది విశ్వమోహనమూర్తియై
యెంతభాగ్యము భర్తతో రథ మెక్కి ముందటిబండిపై
నింతగౌరవ మొప్ప నేగుట యేలతాంగులు నోతురే?

వ. అని పౌరవనితలు మెచ్చుకొనుమాటలు వించు వారిపలుకుల కుబ్బి ఋశ్యశృంగునివంకఁ జూచి తలవంచుచుఁ జిఱునవ్వువెన్నెలలతో శాంతాదేవి ముదం బందుచుండ నరదంబులు రాజసౌధంబులఁ జేరిన రాణులెల్ల నంతఃపురప్రవేశమ్ము సేసినఁ దక్కిన రాజస్త్రీలందఱు శాంతచుట్టును మూఁగి

సీ. పడఁతి మీపిత రోమపాదులు సేమమా?
కుశలమా? మీతల్లి కోర్కివల్లి
యెండలోఁ బడివచ్చి తింక స్నానముచేసి
విశ్రాంతిఁ గైకొనవే కుమారి!
యెన్నాళ్లు లైనదే యీవు రాఘవకుల
మ్మును వీడి చని యోసి ముద్దుబిడ్డ!
కడు స్రుక్కితివి లేచి కడఁగి భుజింపవే
మా మెంతవాడెనే ముద్దుగుమ్మ!

అల్లపసినాఁడు నీవు భాగ్యాలరాశి
వనుచు ఋషిధర్మపత్ని వౌదంచు నెఱుఁగఁ ౨౪౦

జాలమైతిమె యో పూతచరిత! యేమి
భాగ్యమే నీది గౌరవయోగ్యరాల!

గీ. అని యనేకవిధంబుల నాదరించి
యంప శాంత పుట్టింటి రెట్టింపుసుఖము
భర్తతోఁగూడి యనుభవింపంగనయ్యె
మునిని గూడిన తరువాత మొదటిసారి

క. కౌసల్య వచ్చి తల్లీ!
నీ సుఖమే మొదట పైనినే నాసుఖమం
చా శాంత కేమివలయునొ
యాశాంతములందు నున్న నవి తెప్పించున్

క. అమృతపు నవ్వులు నవ్వుచు
సుమిత్ర శాంతకును సర్వశోభలు సేయున్
క్రమమున మునికిని శాంతకు
నమర్చి గదు లెల్లఁ గేకయాత్మజ పొంగున్

వ. అంత

సీ. ఎట్టినొ నేత్రమ్ము లిష్టివేళానల
ధూమసంతానమ్ము తూఁటినట్లు
ఆకులు తినుట దీక్షాకాలభోజన
నియమతీవ్రతచేత నెగడినట్లు
చివురాకు ముక్కునఁ జిమ్ముట జుహువుచేఁ
బాత్రాదికమ్ములు పట్టినట్లు
పంచమస్వరము స్తోభలు చక్కఁగాఁ జాఁచి
సామగానమ్ములు సదివినట్లు
రేకలీఁకల నలుపు ధరించినట్టి
నియమవస్త్రమాలిన్యంబు నెఱయునట్లు
సప్తతంతుమహాకార్యసమయమందుఁ
గర్త వోలికఁ గోకిల కానుపించె

సీ. ప్రతి రసాలకుజంబుఁ బచ్చిపిందెలతోడ
నెల మసలినకాంత వలెనె తోఁచె
ప్రతి నిస్వనద్బంభరము యజ్ఞదక్షిణ
కై యేగు బ్రాహ్మణునల్లె తోఁచె
ప్రతి మల్లెపూవు సవప్రేష్మహావిరర్ధ
సుగృహీతలాజల చొప్పు దోఁచె
ప్రతి చిన్నిపూఁదోఁట పలితదోహదధూప
ముల యజ్ఞవాటిక వలెనె తోఁచె
మాధవుఁడు సవప్రీతుఁ డన్మాట కలిమి
నెల్లరీతుల సాగింప నేమొ యనఁగఁ
దాను దద్ధితరూపమాధవుఁడు వచ్చె
దీప్తమఖయోగ్యనిర్వ్వర్ప దిష్టమూర్తి

సీ. దశరధరాజు శాంతర్ష్యశృంగులకును
దగ వత్సరాదిపండుగయుఁ గూడ
జలకమ్ము లాడించి సన్నమామిడిపిందె
ముక్కలతో వేఁపపూఁతఁ బెట్టి
సన్నబంగరు జరీ చిన్ని పీతాంబరం
బులు గట్టఁ బెట్టి జోళ్ళులు ప్రియాన
వజ్ర గోమేధిక వైదూర్య మరకత
స్వచ్ఛకాంతులగు భూషణము లిచ్చి
మునికి నర్ఘ్యపాద్యంబు లిమ్ముగ ఘటించి
షడ్రసోపేత దివ్యభోజనము పెట్టి
సుప్రసన్నుని మునిరాజుఁ జూచి భక్తి
వినమితశిరస్కుఁడై సమీపించి మఱియు

ఉ. అచ్చట రోమపాదుని గృహంబుల సౌఖ్యము లందుచుండ నేఁ
దెచ్చితి మిమ్ము మీ యనుమతింబడి నైనను మీకు నిందు నే
పొచ్చెము లేక యున్నదియె భూదివిషన్మణి! మీకు శాంతకుఁ
నచ్చిక నెల్లవారలు ఁపొనర్తురె మీవగు నాజ్ఞ లన్నియుఁ ౨౪౦

క. నీవన్నమాట ప్రతిదియు
సేవకు లందఱును లెక్క సేయుదురు గదా?
నీవిచ్చు చనవు గౌరవ
భావన సేయుచు నెడందఁ బాటింతురుగా?

క. ఏరును చూపుల మాటల
ధోరణి నడతను మలంగు ద్రుతి నీయందున్
గౌరవము సడల నీయరు
గా! రమణులు నిన్ను నిన్నుఁగాఁ జూతురుగా!

వ. అని యడిగిన దశరథునకు ఋశ్యశృంగుఁ డిట్లనియె

క. నీ యంతిపురమునందున
నాయెడ గౌరవము సడలునా? నన్నును నీ
వో యధికమో యనంగా
వేయువిధంబులుగ గౌరవింత్రు నృపాలా!

క. అల రోమపాదు గేహం
బులకన్నను నిచటె నాకు మోద మధికమై
వెలసెడు శాంతయు మీ యిం
డ్లుల నచ్చట కన్నఁ బ్రేమ నూల్కొలుపు సుమీ!

క. ఋణపఱచుచుంటివిని న
న్నును నీదెస జన్నమింకనున్ మొదలిడ వే
మి నృపా! సంభారమ్ములు
పోసరింపుము వదలు గుఱ్ఱమును వేగముగన్

క. అను ఋశ్యశృంగుఁ గనుఁగొని
వినమ్రమమాళి యయి భక్తి వెట్టిన దోసిం
టను రాజు నశ్వమేధం
బున నాధ్వర్యవము నీవ పూనఁగ వలయున్

గీ. యాజకత్వము సేయఁ బుత్త్రార్థి నగుచు
నిను వరించుచునుంటి మనీషిలోక
మాళిరత్నమ! యనిన నమ్మౌనిరాజు
ప్రీతుఁడై దాని నంగీకరించి యనియె

శా. సంభారమ్ములు కూర్పఁ బంపు నృప! యశ్వంబుల్ సహస్రిజ్వాల
ద్గంభీరోజ్జ్వలసైన్యయుక్తముగ వేగం బంపుమా! సన్మహా
త్వాంభోరాశి వశిష్ఠదేవునకు నీవై పోయి శీఘ్రంబుగా
దంభాపేతముగాఁగఁ జెప్పవలె నధ్వర్యుండు నే నౌటకున్

క. ఆపైని నేను జెప్పెద
నా పుంజ్యోతిస్స్వరూపు ననుమతి సర్వ
వ్యాపారంబుల నిర్వి
ఘ్నోపాయపథంబుఁ జూపు నుఱియ యగుఁగదా!

చ. అనవుడు మానిలోకగురువైన వశిష్ఠునితోడ నంతయున్
ముని పతి పైని మానియును బోయి వచింప వశిష్ఠుఁ డెంతయే
నిని నిది యుక్త మింకఁ జేసనీ! తురగం బనుకొన్నదాది యిం
దనుకనె యొక్కయేఁడు సనె నాయన! వేగిర పొందుమం చనన్

శా. రాజుల్ శీఘ్రముగా సుమంత్రు నటకున్ రావించి వేగంబ యి
చ్చో జాబాలిని గశ్యపున్ మన సుయజ్ఞున్ వామదేవున్ మహా
తేజోరాసులఁ బిల్వఁబంపవలె ఋత్విక్శ్రేణి నన్యుల్ ద్విజుల్
భ్రాజిష్ణుల్ సనుదేరఁగావలయుఁ బిల్వంబంపుమా! వెంటనే

క. తానె సుమంత్రుఁడు చని యా
నానాభూసురులఁ బిల్చినన్ వారరుదే
భూనాథుఁ డెల్లవారి న
నూనంబుగ గౌరవించి నుతిపూర్వముగన్

చ. కొడుకుల కోసమై దిగులుగొన్న మనస్సునకున్ సుఖంబులే
దెడపక యశ్వమేధసవ మే నొనరింపఁగఁ బిల్వఁబంచితిన్
గొడుకులు గల్గుకోసమయి కోవిదరత్నము ఋశ్యశృంగులున్
గడపఁగ జన్నమున్ సుతులఁ గాంతును మీ దయకల్మి చేతనే

మ. అని ప్రార్థించిన తేనికిన్ ముదితులై యావారలెల్లన్ సెబా
సని నీకున్ సుతు లుద్భవించెదరు రాజా! నల్వు రుద్దామశౌ
ర్యనితాంతప్రతిభుల్ గుణాంబుధులు సూర్యప్రౌఢతేజుల్ తనం
తన నీ కీ మతి మెప్పుకల్గె నపుడే త్వద్వాంఛలున్ దీరెడిన్ ౨౭౩

ఆ. ధర్మబుద్ధి మఱి వృథాపోవ దెప్పుడు
అశ్వమేధయజనమందు నీదు
మనసు దవిలె నపుడె మానవనాయక!
నీకు సుతులకలిమి నిశ్చయంబు

వ. అని ఋశ్యశృంగపురోగంతలు వశిష్ఠప్రముఖు లాశీఃపూర్వకానుజ్ఞ
లిచ్చిన

శా. ప్రమదముచే భుజద్వయము పట్టుక తేఁడు నమాత్యులఁ గురూ
త్తము లనుమాట వింటిరికదా! యిఁకఁ దక్కిన యెల్లయైన కా
ర్యములును మీవి జన్నమునకైన ప్రయత్నము లెల్ల మీర వే
గమునఁ బొనర్పఁగావలయుఁ గాలము లేదను నింకఁ జూడుఁడీ

మ. యయువుఁ బుచ్చుఁడి యుత్తమోత్తమము సోపాధ్యాయముల్ సద్ధిర
ణ్మయభూపానవసజ్జనాప్రణుతసంపద్ద్రవ్యముల్ వెంబడిన్
రయమేపారు సహస్రితోఁ జనఁగ శస్త్రాజీవులన్ సంయుగ
క్రియలన్ బూర్వము రాటుదేలిన భటశ్రేణిన్ నియోగింపుఁడీ

చ. ఒకనిముసంబు జాగు తగ దుండిన మీ రిట నున్నయట్లుగా
సకలము గూర్పఁగావలె వెసన్ సరయూత్తరభూమి యజ్ఞవా
టికి ననువుం బొనర్పుఁడు ఘటింపుఁడు యజ్ఞగృహంబు లల్లయా
జ్ఞికులును దత్ప్రమాణములు చెప్పినయట్లన గట్టఁబంపుఁడీ

క. ఏవరునఁ జెప్పఁబడువో
యావరునను శాస్త్రసమితు లాడిన యట్టుల్
గావింపవలయు శాంతులు
గావించుటె కాదు హెచ్చుగాఁ జేయవలెన్

క. ఇది సర్వరాజులును జే
యుదు మన శక్యంబుగాద యొకయపరాధం
బాదవినఁ గష్టము ఛిద్రము
వెదకెదరు సుశాస్త్రవిదులు ద్విజరక్షస్సుల్

ఆ. క్రతువు చెడిన యజ్ఞకర్తయు నశియించు
గ్రతువు చెడకయుండఁ గడపవలయుఁ
గార్యరచనయందుఁ గంజాతయోనులుఁ
గంజలోచనులును గారె మీరు

క. అని మంత్రుల నియమించిన
మనుజాధిపధర్మబుద్ధిమహిమలు గని బ్రా
హ్మణులు పతిఁ బొగడి యాతని
యనుజ్ఞఁగొని తిరిగి వార లరిగిరి యిండ్లన్

ఉ. సాంగ్రహణేష్టితో మొదలు సల్పి తురంగవిసర్జనాంత మె
ల్లం గ్రమ మొప్పఁ జేయుఁ డవలన్ మనకింతయు వీలు చిక్క దం
చుం గ్రతుభార మెల్ల మతిశుద్ధులు మంత్రుల కప్పఁజెప్పి వా
రిం గ్రమమొప్ప గౌరవధురీణుల గౌరవపూర్వకంబుగాన్

ఆ. వీడుకొలిపి రాజు వేశ్మముల్ సొచ్చిన
మంత్రులెల్ల తను నియంత్రితములు
కార్యములను సేయఁ గడఁగిరి మధువేళఁ
దేనెకొఱకుఁ దిరుగు తేఁటులట్లు

క. జన్నముకొఱకై యంతకు
మున్నే యిడినట్టి యామముల యిట్టికలున్
సున్నము వేలును బుట్లును
గ్రన్నన వచ్చిపడెఁ గ్రతుధరావీథికకున్

సీ. నాల్గుశాఖల బ్రాహ్మణశ్రేణి బ్రహ్మచ
తుర్ముఖంబులవోలెఁ దోనవచ్చి
రఖిలకర్మాంతికు లధికప్రవీణులౌ
శిల్పకారులును వచ్చిరి సవార్థ
మైన స్రుక్స్రువముల నఖిలలక్షణయుక్త
ములు యూపముల్ సేయఁగలుగు వర్ధ
కులును వచ్చిరి రాజకుంభకారులు ఖన
కులు గణకశ్రేణి గూడ వచ్చె
భరతమానివేదపారంగతుల్ నట
నర్తకులును వచ్చినారు సామ
వేదవాదనప్రవీణవీణాహస్తు
లైన ద్విజులు వచ్చి రమృతనిధులు

చ. తిరిగి వసంతకాల మరుదెంచె నిదంచిత చంచరీకసం
చరణ పదార్పితప్రసవ సంచయ సంచిత మాధుబిందుని
ర్ఝరములు బుగ్గలై యుబుక శాఖలఁ గోకిలకాకలీమధు
స్వరసరణిప్రవల్గితదిశామధుకుల్యలు పాయలై చనన్

చ. దశరథరాజు భక్తివినతంబగు మౌళి వశిష్ఠుఁ గాంచి శా
స్త్రసరణిఁ దత్పదాబ్జముల సర్వసమర్చలు సేసి తాత! మీ
రు సకలయజ్ఞకార్యమధురూపులు సర్వవిదుల్ క్రతుక్రియా
నిశితమతిప్రధర్ మనుమనిర్ దయచూడుఁడు సర్వరీతులన్

చ. పొరి పొరి నాదెసన్ గరఁగిపోదువు మిత్రునివోలెఁ జూతు వ
చ్చురముగ నన్ను మాకు గురుమూర్తివి నీ మొదలం గమించిపో
వరు తొలిరాఘవుల్ క్రతువుపట్టున విఘ్నము పుట్టకుండ నీ
బరు వఖిలంబు మోయుము కృపామతి! నిన్విడి త్రోవయున్న దే?

ఉ. ఆర్యుఁడ వప్రమేయమహిమాన్వితమూర్తివి నైనయట్టి నీ
ధైర్యముగాక నే సవనతత్పరుఁ డౌదునె? నీవ యీ మహా
కార్యము సేయుచుంటి వని కైజత మోడ్చి నమస్కరింప ధీ
ధుర్యుఁడు మౌనిరాజు క్రతుధూర్వహుఁ డయ్యె నరేంద్రు ప్రీతికై

మ. నరనాథావసథంబు లెల్ల ముని యాజ్ఞాపించె శోభానిరం
తరసందీప్తులు గల్గఁజేయఁగ నయోధ్యాపట్టణస్థుల్ ధరా
సురగేహంబు లలంకృతంబులు బుభుక్షుప్రాపితానేకభా
సురభక్ష్యాన్నరసంబులై నిరతమున్ శోభిల్లు నట్లుండఁగా

చ. పురిఁ బెఱయిండ్లకెల్లఁ బ్రతిపూఁటయు రాజమహానసంబునుం
డి రుచిరభక్ష్యభోజ్యకమనీయరసాన్నములన్ దలిర్చు ప
క్వైరములు బుట్టలున్ బ్రమదలీలను బంపఁగ మౌని యాజ్ఞ యి
చ్చె రససమృద్ధియున్ రుచియుఁ జేసిన పాకము లెల్లఁ జిమ్మగా

ఉ. పల్లెలనుండి యజ్ఞమని వచ్చినవారికి నెల్లవేళలన్
బిల్లయు మేఁకయంచనక పెట్టవలెన్ సకలాన్నభక్ష్యముల్
కొల్లలుగాఁగనై విసువుకొంటయుఁ గోపముపై విదల్చుటల్
సెల్లఁగరాద యెవ్వరయి సేరిన నన్నము పెట్టి వేళలన్ ౨౯౩

మ. క్రతుకార్యంబుల వ్యగ్రులైన పురుషుల్ కర్మాంతికుల్ శిల్పు లు
న్నతులై వచ్చిన భక్ష్యముల్ మృదురసాన్నంబుల్ సదా త్రేఁచున
ట్లు తినంగాఁ గొనిపోవఁగా నొసఁగ నే లోపంబు లేకుండఁ ద
న్మతి కెక్కన్ ధన మిచ్చి పంప ముని యాజ్ఞాపించెఁ దీవ్రంబుగా

క. మతి రాజాజ్ఞకు నైనను
వ్యతిక్రమము కల్గునేమొ యఖిలజనమన
స్తతి నియమించెను నమ్ముని
పతి మాటకుఁ గట్టువడియెఁ బతి గేహమ్ముల్

క. ముని గీసిన గీఁతను దా
టను జాలఁడు రాజె యేమిటన్ దొలఁగి చనన్
జనమున కగు? మునిపతి చే
సిన యాజ్ఞారేఖ దీపశిఖయై వెలిగెన్

ఉ. శర్మవిధాత మానిబలశాస్త్ర సుమంత్రుని బిల్చి ధాత్రిలో
ధార్మికులైన ఱేండ్లను ముదంబున యజ్ఞము చూడఁ బిల్వ మం
తర్ముఖులైన బ్రాహ్మణుల ధర్మపథిం జను క్షత్రియావలిన్
ధర్మ్మల వైశ్యశూద్రుల ననంతసహస్రముఁ బిల్వఁ బంపుమా

క. ఈ దేశ మ్మో కుల మను
భేదమ్ములు లేకయుండ వివిధజనములున్
మోదము పొందగ సత్కా
రాదరములు కలుగఁ జూడుమా శ్రద్ధ మెయిన్

ఉ. ఆ చిరకాలబంధువు నహర్పతిశిష్యునిశిష్యుఁడున్ ద్రయీ
శ్రీ చివురొత్తి రక్తిఁగొను సీమ విదేహము లేలుజోతి ధ
ర్మాచరణంబు మేల్పొలమునౌ జనకున్ బిలువంగ నౌను నీ
వే చని పిల్చుటొప్పు మఱి యేరినొ పంపుట యొప్పునే యటన్

క. బృహదారణ్యోపనిష
ద్వ్యాహరద్వేదాంతపురుషు విపిధప్రశయ
ప్రహరహ్మృతదహారవిద్యా
ముహురాహరణప్రవీణపుంజ్యోతిస్సున్ 300

చ. ప్రళయపయోధివీచి బడబాశిఖిఘాతము పొంగి ధాత్రి నీ
ళ్ళల మునిగించుచో జలధి లోఁగొనఁజాలని మట్టిముద్ద య
వ్వల నొకఁడుండు నిత్యమగు పత్తన మా యవనీశు సాదృతిన్
బిలువుము మానవేంద్రుప్రియమిత్రము స్నిగ్ధుని గాశికాపతిన్

చ. అమృతులు యోగ్యులున్ దశరథావనినాథునిమామగారు బా
వమఱఁది యిద్దఱున్ బిలువఁబంపుము కాదు మఱీవె పోయి పి
ల్వుము తగఁ గేకయాధిపుఁడు పుత్త్రుఁడు బంధుసముద్రులౌటఁ గొం
చె మదియు దూరమే యయినఁ జెచ్చెరఁ బిల్చుట యుక్తమే యగున్

ఉ. క్ష్మాపతి యాత్మలో నొదుపు సంగతి యంగధరాధినేత శాం
తాపితృపాదుఁడున్ మిగులధర్మి గుణాంబుధి రోమపాదధా
త్రీపతి యజ్ఞవేళ కరుదేరుట ముఖ్యము ఋశ్యశృంగుఁ డా
భూపతియల్లువాఁడు మఖమున్ నడిపించెడివాఁడ యాటచే

చ. నిభృతుఁడు దాశరాజు గుహునిన్ బిలువన్ వలె రాజ్యవర్తక
ప్రభు వతఁ డంతెగాక గుణవంతుఁడు నిష్కలుషుండు నీవు ధీ
విభవుఁడవౌటఁ జెప్పెదఁ బవిత్రము లూహలు కాక యా యెదన్
ప్రభవముకాని సంస్కృతికిఁ బట్టతఁ డాతని నీవె పిల్వుమీ

శా. ఏలాగైకబురంపెదో తెలియ భూభృన్మిత్రమా పక్షిరా
జాలంబున్ బొనరింప దేవతలకై యస్మన్నృపుం డేగినన్
మేలై సాయపడెన్ జటాయు విచటన్ మేల్కోరు నాతండు నీ
వేలా పిల్తువొ దక్షిణాపథమునం దెందో వసించుంగదా!

వ. ప్రాచీనులైన సింధుసౌవీరులు సౌరాష్ట్రులు దాక్షిణాత్యులు నైన
పార్థివులను బిలిపింపుము

చ. మృదువులు ప్రేమపాత్రులగు మేదినిరాజులఁ బిల్వుమన్న నొ
ప్పిదమగువారి నయ్యెడలు ప్రెగ్గడ పంపి తనంత నేగె భూ
మిదయితు లేరిఁ దా నరిగి మెత్తనిగౌరవ మిచ్చి పిల్వనౌ
నో దనకుఁ గల్గు బంధుగులనో చెలికాండ్రనో పోయి పిల్వఁగాన్

గీ. పనులు సేయంగ నియమింపఁబడిన కర్మ
కారు లరుదెంచి భూపాలకద్విజాళి ౩౦౮

గృహము లన్నియుఁ దగ నలంకృతములుగను
జేసినామని మానితోఁ జెప్పవచ్చి

సీ. బీటువిచ్చినచోట్లు బిగియించి యిటియించి
పెకలినచోట్ల నిట్టిక లమర్చి
పెళ్ళువిచ్చినచోట్లఁ బెట్టి జాసున్నంబు
పైమెఱుంగులు గిలాబాలు చేసి
రంగులువేసి చిత్రములు వ్రాయింపించి
యిడుపులు శోభనాకృతులు చేసి
పందిళ్ళు పాకలు పచ్చనితోరణా
లన్నియు సిద్ధమ్ము లాచరించి
యెల్లవర్గంబులకును బ్రత్యేకముగను
విడిదులను బావులును దొడ్లు వేఱుపఱచి
యన్నియేర్పాట్లు చేసితిమయ్య మాని
వృషభ! భవదాజ్ఞఁబడి యని విన్నవింప

క. తపసి స్వయమ్ముగఁ జని యె
ల్లపనులు మేలయిన నేఁతలం గని మెచ్చెన్
నిపుణులగు కర్మకారుల
కుపద లొసఁగి పంపె దినము లొగిఁ జన్నంతన్

చ. ఉపదలుగాగ నేనుఁగులు నుగ్గులులున్ నెఱిగోవగోడిగల్
కపురము గంబురల్ పునుగు గందము మేలగుకుల్ జగాహారం
గుపసిఁడిక్రొన్నగల్ తళుకుబోకలతో దుముదార్లు జేండ్లు జ
న్నపుఁదఱి కేగుదెంచిరి చనన్ మును బంట్లును వెన్క బందుగుల్

చ. తెఱపి యొకింత లేదు నృపతిప్రతతుల్ చనుదెంచుచుండఁ బె
ద్దఱికము సేసి పూజలిడఁ దాను వశిష్ఠునకున్ నృపాలకుల్
పిఱుద నొసంగు గాన్కలన్ని బెట్టెల కెత్తఁగ నేన్గుగుఱ్ఱముల్
గుఱుతిడుకో సుమంత్రునకుఁ గొట్టములందునఁ గట్టఁ బంపుచున్

చ. ఉడుకులయంచులన్ జలము లుబ్బి తరంగల నొత్తుచున్ సము
ద్రుఁడు బడబాగ్నివోలె సరితూఁగి యయోధ్య సమస్తరాజులన్ ౩౧౩

గడుపున దాచెఁ దద్భలముఖంబులు హద్దుల కొత్తి తత్ప్రభల్
మడగకయుండ స్వీయమహిమల్ పెనుకాల్వలుగాగ నూఁగఁగన్

ఆ. పాలకడలితనయ పద్మ పెండిలివేళ
నఖిలజలధిరాజు లరుగుదెంచి
యతనిలోనఁ గలసినట్లుగఁ బరరాజ
బలము లవి యయోధ్యఁ గలసిపోయె

సీ. చని యెంతప్రొద్దువేళను దల్పు దట్టినఁ
జిటుకలో వచ్చి తీసెదరు తలుపు
మంచితీర్థమ్మును గొంచెమిత్తురె యన్నఁ
దియ్యని మజ్జిగఁ దెచ్చియిత్తు
రరుగుల నిదురింతు మన్నచోఁ దాము ని
ద్రించు మంచముఁ బ్రక్క తెచ్చియిత్తు
రప్ప! పిల్లకు వేళతప్పు భోజనమున
కన వండిపెట్టుదు రప్పుడపుడె
ఆ పురంబునఁ బురుషులు నంగనలును
దమ ధరాపతి యజ్ఞవిధానవేళఁ
దామె గేస్తులై వచ్చునందఱును దమకె
యతిథు లన్నట్లు గౌరవ మాచరింత్రు

ఉ. అంత వశిష్ఠులున్ దశరథావనినాథుని గాంచి యత్న మొ
క్కింత కొంతంత లేదు ధరణీశులు నీకును నైనవారు నీ
యంతిక మేగుదెంచిరి యథాజ్ఞముగాఁగ భవత్ప్రజాళి వ
ర్తింతురు వెంటనే బయలుదేరుము పావనయజ్ఞవాటికిన్

చ. ఉరువడిఁ గానవచ్చె సరయూనదికిన్ మొనమొన్న వట్టి బం
గరుబయలైన యుత్తరపుగట్టున నేఁడు విచిత్రచిత్రసుం
దరతరయజ్ఞసౌధము లనంతము లాత్తరమాప్రగల్భముల్
పురుడు తలంపుతో నగుచుఁ బుట్టినవో యనఁగా నిలేశ్వరా! ౩౧౮

సీ. పిఱుదివియనిమగల్ గుఱికాండ్రు నాల్గువం
దలమంది రాజపుత్రికులు సూతు
లును గ్రామణులు క్షత్తలును సంగ్రహీతలు
రక్షించినట్టి తురంగమమ్ము
సనుదెంచెఁ బదునొకండు నెలలకును మున్నె
యట రథకారగృహంబునందుఁ
దెచ్చి బద్ధాంఘ్రుల ధృతులు నాలుఁగు వేల్చి
నారు పురోహితుల్ సూరిమణులు
యయువు మేధీయశాలికాభ్యంతరమునఁ
దెచ్చి యాశ్వత్థవ్రజము బంధించినార
లోయి పుణ్యోదయా! పురుహూతసమమ
తిప్రభావ! యిప్పుడ బయద్దేరవలయు

క. అదె ఋశ్యశృంగుఁడును నీ
సదనము కేతెంచుచుండె జన్నమునకు ని
న్నిదె కొనిపో నతని మొగము
తుదలను నుత్సాహదీప్తి తొణికిసలాడన్

క. అనినంత ఋశ్యశృంగుఁడు
సనుదెంచి ధరాధినాథ! సర్వము సిద్ధం
బినవంశవనధిచింతా
మణి! మణికల్పితసహస్రమండన! యనినన్

ఉ. ఆస్యమునందు భక్తి తొలుకాడఁగ ఫాల్గునమాసమం దమా
వాస్యయు నాట సూర్యభగనానుఁడు దోఁచిన శన్యుషస్సునన్
గాశ్యపిభర్త యజ్ఞపరికల్పితవాటిఁ బురోవశిష్ఠుఁడై
ఋశ్యవిషాణమాని వివరింపఁగ యజ్ఞవిధాన మేగినన్

ఆ. మునిని ఋశ్యశృంగు ముందిడుకొని వశి
ష్ఠాదిమునులు రమ్యయజ్ఞవాటి
గతులు ద్విజులు యజ్ఞకర్మ మారంభించి
రాగమముల నుక్తమైనయట్లు

శా. శంసామార్గవిధాత లార్జవనిధుల్ సాధుల్ త్రయీన్యాయమీ
మాంసావేత్తలు కల్పసూత్రవదనుల్ తత్కర్మదేవతల్ కృష్ణవ
ర్త్మాంశుల్ యాజకులై ధరిత్రిపుని యజ్ఞారంభముల్ దీర్పఁగా
శంసామార్గ మతిక్రమించె మఖదీక్షాకాలసాన్నాయ్యముల్

పంచచామరము.

మొదల్ దినంబు లేదు మూఁడు మూఁడు వైశ్వదేవముల్
• పదంపడిన్ మహాగమంబు పల్కినట్టి హోమముల్
పదింబదిం బొనర్చి కల్పవాగ్వ్యతిక్రమంబు లే
క దాంతులై చరించి రెల్ల తత్క్రతుప్రవేశయాజకుల్

శా. ధీమన్ముఖ్యులు ఋత్విజుల్ ప్రభువులై దీపించి 'నాసగ్స్థితే
సోమేఽధ్వర్యు'రితిప్రపంచితమహాసూత్రార్థముల్ దాటకే
మా మా యంచు ననేకవింశతులు హోమంబుల్ విధింజేసి రా
హోమాంతమ్మున వేల్చి రెల్ల హవి సింపొందఁగఁ బూర్ణాహుతిన్

ఉ. ఆపయి యాజకుల్ క్రతుమహాగమవేత్తలు ద్వాదశప్రవ
ర్గోపసదంబులన్ సలిపి రొప్పుగఁ దా రుపదేశశాస్త్రమా
ర్గాపతితంబులై వెలయునట్టివి పై నతిదేశతఃపరి
ప్రాపితమైన కర్మలును నన్నియుఁ జేసిరి వ్యగ్రబుద్ధులై

క. తవిలి ద్విజావళి ప్రాత
స్సవనము మాధ్యందినంబు సాయంసవనం
బు విశేషవిధుల్ సలిపి వి
ధివదాచరణంబులన్ నుతించిరి సోమున్

సీ. ప్రాతస్సవనమందుఁ బ్రభు నింద్రుఁగుఱిచి సో
మాంశంబు నిచ్చిరి యా ద్విజాళి
హరివంతుఁడని వాని కర్పించి ధానము
లంతఁ బూషణ్వంతుఁ డని కరంభ
మరసి సరస్వంతుఁ డని పరివాపమ్ము
వాసవుం డని పురోడాశ మిచ్చి
మిత్రావరుణులంచు మృదుపయస్య నొసంగి
యింద్రు నుద్దేశించి యెల్ల నొసఁగి

యొక పయస్య వినా పురుహూతునకు నొ
సంగి మాధ్యందిన తృతీయసవనములను
ఋత్విజులు చుట్టుఁజేరి యర్చించి బిట్టు
స్తోత్రములఁ దృప్తుఁజేసిరి సోమరాజు

ఆ. బ్రహ్మ దక్షిణమునఁ బశ్చిమ మ్మధ్వర్యుఁ
డుత్తరమున హోతయును దొలిదెస
నుదితముఖుఁడు నిలచి యుద్గాత ఆల ఆ
రూపు సోమదేవు ఋత్విగాగరు

శా. గీర్వాతుర్యవిదగ్రగణ్యులు మతిక్రీడాప్రమాణుల్ వచో
నైశ్చల్యప్రథమావతారులు ద్విజుల్ నానామహాయజ్ఞకా
ర్యాశ్చర్యక్రమమాణులై నడుపఁ బ్రత్యాదేశముల్ లేక ప్రా
యశ్చిత్తేష్టి యటన్నపల్కు వినరా దా రాజు జన్నంబునన్

క. అహుతం బని స్ఖలితం బని
యహరారంభావసానయజ్ఞాహుతి మం
త్రహతాదుచ్చారణములఁ
బ్రహరింపదు మంత్ర మొకఁడె బ్రహ్మగతిఁజనున్

గీ. ఋక్కులు యజుస్సులును సామ లొక్కఁడొకఁడు
నిక్కి దేవతలును బోలె నివ్వటిల్లె
నసిమహోచండముగ నుదాత్తానుదాత్త
ములును స్వరితముల్ తీక్ష్ణతామూర్తు లయ్యె

ఉ. జన్నము సాగినన్ని దివసంబులు నిల్చినచోట నిల్వకే
చన్నప్రజల్ బడల్వడరు సంతస మింత కొఅంత పొంద రా
పన్నులుకారు నాఁకలిపిపాసల డయ్యరు మాకలంబడన్
స్విన్నులుకారు బందుగుల వీడి చరింపరు తప్పిపోవరున్

ఉ. సుందరయజ్ఞవాటి వెనుచోఁట్పునఁ దీరిచి దిద్ది వేయు మేల్
పందిరులందు సోలుపుల బంతులు తీరిచి నాథవంతులున్
దిందు రనాథవంతులును దిందురు గట్టునఁ ద్రేఁచి త్రేఁచి గో
విందలు కొట్టుచున్ జిఱుతబిడ్డల పొట్టలనిండఁ గుక్కుచున్ ౩౩౮

ఉ. విస్తరిమీఁద వంగఁబడ వేయక మానెదరేమొ సూదకుల్
విస్తరిపైని వంగుటకు వెన్నును వంగదు పొట్ట వంగదున్
హస్తము లడ్డముంచినను నాగక వడ్డనఁ జేతు రన్నియున్
గస్తిగ నట్లె తిందు రవుఁగాదనలేక క్రతుప్రసాదముల్

సీ. ఇపుడె గుండిగ దింపి యిగురఁబెట్టితిఁ బొడి
పొళ్ళాడు నీ యన్నమును దినుండు
పూర్ణమ్ము లేకుండఁ బునుకులుగా వేసి
తిఖి కరకరలాడు తినుఁడు వీని
గాలుచునున్నది కాఁబోలు శ్రీరాన్న
మిదె దొన్నెలను దెచ్చియిత్తు నుండుఁ
డిది గడ్డపెరుగు మీరింకఁ గొంచెము వేసి
కొనవలెఁ జలువసేయును గదండి
యనుచు బతిమాలి బతిమాలి యవనినాథ
సూదకులు కొల్లలుగఁ దెచ్చి చూఱయీయ
నన్నమున నాదరంబునఁ దిన్నకడుపు
వెన్ను నెడదలు నుబ్బిపోయెదరు జనులు

సీ. అన్నంపురాసులు చిన్ని తోమాలెల
కై సన్నజాజులు పోసినట్లు
సన్న ఖర్జూరపుఁ జాపలపై నూప
రాసులు గంధమ్ము తీసినట్లు
ఎఱ్ఱవాగుగను వేయించి నప్పడములు
పునుఁగు కుంకుమ కుప్పవోసినట్లు
వంగపండుల పేళ్ళ వరుగు చోష్యపు గుబా
ళింపు లత్తరులు నొల్కించినట్లు
రాఘవుల యిలువేల్పు శ్రీరంగనాథ
ప్రభువు పవళింపుసేవకై భద్రపఱచి
నట్టి సంభార మనఁగ మహానసంబు
ద్రవ్యముల్ పొల్చె దశరథక్రతువువేళ

క. పాకము రమ్యము నాదర
పాక మ్మది రమ్యతరము ప్రాక్సుకృతపరీ
పాకమ్ము రమ్యతమ మని
వాకుల కందని పొగడ్త పట్టుదురు జనుల్

క. హోమములు లేని తెఱపిని
భూమీపతి చెవులఁ దవుల మోదము పొందన్
గ్రామీణులు నాగరకులు
భూమీంద్రులుఁ బొగడుచుండ భోజనవసతుల్

క. క్షితిసురు లందఱు నగ్న్యా
హితులు నధీతత్రయీత్రయీశిఖులును వా
క్పతురులు షడంగవేత్తలు
శతానుచరు లొక్కఁడొకఁడు స్రగ్వి మకుటియున్

శా. అర్చిర్హోమము లేనివేళ వసుధాధ్యక్షుండు షట్ఛాస్త్రవా
క్చర్చాప్రౌఢవిపశ్చిద్గ్రణులచే శాస్త్రార్థముల్ వించు హో
మార్చల్ సేయుచుఁ గ్లిష్టఘట్టములు స్పష్టార్థంబుగా వాగ్వివా
దార్చిష్మంతులఁ బండితోత్తముల వాక్యార్థంబు సేయించెడున్

ఉ. మైథిలుఁడైన బ్రాహ్మణుఁడు మానవనాథుని ముం దొకండు వీ
ణాధరుఁడై సరస్వతియొ నారదుఁడో యన సామగానపున్
మాధునదంబులన్ బఱప మత్తిలు తేంట్లన హోమధూమముల్
ప్రోధము లెత్తి వైణికుని మోమును గన్నులఁ గప్పె నంతటన్

ఉ. అంబుజనేత్ర యోర్తు భరతాగమసూత్రరహఃప్రయోక్త్రియై
యంబుజనేత్రు వామనుకథాంశముఁ బాడుచు యజ్ఞకర్మముల్
గ్రొంబువులైన హస్తములకోసలఁ జూపిన ఋత్విగావళుల్
శంబరవైరితాత, యని చానఁ బొగడ్తలు పట్టి రెంతయున్

ఉ. అంతట నొక్కనాఁడు గగనుదంచలచంచలమారుతచ్ఛటా
తాంతమహాగ్నియై వియదుదారగతిన్ జనుదెంచి రమ్య ప
ర్యాంతములైన నీడగమి యార జటాయువు గాఢనేమిను
ద్భ్రాంతిఁ జరింప మింట వసుధాపతి తాఁ దలయెత్తి చూచుచున్

శా. ఎన్నన్ నీవు జటాయువా? సఖుఁడ! రా! యెన్నాళ్ళ కెన్నాళ్లకీ
నన్నున్ లోనఁ దలంచినావు కబు రందం జేసిరా నీకునున్
మిన్నున్ డిగ్గుము నీవు వచ్చితివి నా మేధంబు సాఫల్య మం
దు న్నీకున్ గబురంపుటన్ దగు సుమంత్రుండున్ సుమంత్రుండుగా

క. అన డిగిన పక్షిరాజున
కును ఱెక్కలు నిమిరి చుంచుకొస చాది నినున్
నినుఁ గంటిని స్నేహావధి
నని ఫలముల నారగింప నందిచ్చు తఱిన్

ఉ. నాకమునందు యుద్ధముల నాడఁగఁబోయెడు రాజుతోడ మై
త్రీకలనన్ వహింతు రెవరే ననియందున దీర్ఘపక్షచం
చూకృతదారణాత్తరిపుశష్కుఁడు నీతఁడు మిత్రుఁడౌట లే
దేకద యబ్బురం బని వహించిరి యబ్బురముల్ సభాసదుల్

గీ. పక్షిరా జారగించుచోఁ బార్థివుండు
తాత! నీచెల్మి యొకయెత్తు దైవతాధి
నాథుచెల్మియు నొకయెత్తు నా కటన్న
ఱెక్కతుద లార్చి యసుగ్త్తి పక్కితేఁడు

ఉ. నే నొకపక్షిమాత్రుఁడను నీవఖిలేశుఁడ విట్లు నన్నుఁ బ్రే
మానతబుద్ధిఁ గాంతువు ధరాధిప! నీవన నాదుమైత్రికిన్
గానను హద్దు నీ విటుల గౌరవమాడినయంతఁ బొంగి నా
లోనన నేను గ్రొమ్మనసులోఁ బులకించుచు నుంటి మిత్రమా!

ఉ. ఈ మిషపెట్టి వచ్చితిని యెంతటి కెంతటి కెంతదూర మీ
భూమి నినున్ గనుంగొనఁగఁ బుత్త్రిలు గల్గుదురయ్య నీకు నే
నా మునికూనలన్ గనుదునా? కనుఁగొన్నను గుర్తుపట్టువా
రే? మఱి నీకుమారు లని యించుక చంచువు వాల్చి నవ్వుచున్

క. తన పక్షాంచలమారుత
మున ఱేనికి వీవఁ జాలు పో! నీవా? నా
కును వీతు వంచు దశరథ
మనుజేశ్వరుఁ డతని వీచె మలువసనమునన్ ౩౫౧

గీ. ఉండుమని యెంత బలవంతమో పౌనర్భ
రాజు మీా మానవులకు నారాక యొకఁడె
వ్రేఁగు నిలచుట కాదని వెడలె నతఁడు
రాజునకును గన్నిళ్ళపర్యంత మయ్యె

ఆ. పోవుచున్న పక్షిపుంగవుతో నేగి
యజ్ఞవాటిదాఁక నవనిపతియుఁ
బట్టణమ్ము దాఁకఁ బంపె సుమంత్రుండు
నెగిరి యేగె నంత ఖగకళతారి

క. యూపోచ్ఛ్రయకాలంబును
బ్రాపించిన వర్ధకులును వచ్చిరి పక్ష

లై పరిధృతనూత్నవస్త్రులై శుభముఖులై

ఉ. చిత్రికఁబెట్టి మక్కిడకఁ జేవమెఱుంగులు నున్నుదేర సా
ర్వత్రికమైన శ్లక్ష్ణతయుఁ బైనికిరీటము మూల లెన్మిదిన్
సత్రపతాకలో యన నెసంగెడు యూపము లిర్వదొక్కటిన్
బాత్రములన్ దృఢంబులను వర్ధకులున్ గొని తెచ్చిరిం బడిన్

పద్మనాభము.

యూపంబు లొక్కొక్కడే యిర్వదిన్నాల్గ
హో! యంగుళంబుల్ దలిర్పన్ దిదృక్షా
శ్రీపొంగి యధ్వర్యుముఖ్యుల్ ముదంబంది
చిత్తంబులన్ శాస్త్ర మారీతి దేగా
నీ పర్ణ లీయూఱు నీయూఱు బైల్వంబు
లీ యూఱునున్ ఖాదిరంబుల్ మఱొండీ
యూపంబు శ్లేష్మాతకంబౌ సటీ రెండ
హో! దేవదారుల్ సరే లెక్కవచ్చెన్

క. అని యూపోచ్ఛ్రయ కర్శ్మం
బునకుం గడఁగిరి సమర్థములు మంత్రములన్
మునికల్పులు బుత్విజులును
మనుపరులై పొల్చు తోఁటమాలులపోలెన్

గీ. మొదట శ్లేష్మాతకము పాతి పిదప దాని
కిరుదెసల దేవదారువు లిట్టునటుల
మూళ్ళుగా మోదుగులును మూరేళ్ళ ఖదిర
లోలయ ఖాదిరపాలాశములను బాతి

క. అమరిచిరి మెడములను యూ
పము యూపము నడుమ షణ్ణవత్యంగుళముల్
సుమమాలాకుంకుమగం
ధములను వస్త్రముల శోభితంబులు గాఁగన్

క. సుమమాలాకుంకుమగం
ధములను వస్త్రముల శోభితములై తగు యూ
పము లేడు నేడు సప్త
ర్షిమండలమహస్సులై విశిష్టతఁ దాల్చెన్

ఆ. కూడి శుల్బకర్మకుశలులౌ బ్రాహ్మణుల్
సూరిమణులు శుల్బసూత్రవిహిత
మైనయట్లు చేసి రగ్నిసంధానమ్ము
నిట్టికల ప్రమాణ మెఱిఁగి తెచ్చి

గీ. ఱెక్కలును బుచ్ఛమును బ్రసరించి శిరము
వాంచి నిలచిన గరుడినా వహ్నులాఱు
ప్రతిదిశమ్ము సహస్రహిరణ్యశకల
ప్రోక్షితమ్ములు జ్వలియించె భూపశిఖులు

స్రగ్ధర.
నానాదైవత్యముల్ పన్నగములు ఖగముల్ నాకరాజాదిదేవ
శ్రేణిప్రీత్యర్థమై కూర్చిరి ద్విజులు పశుశ్రేణులన్ రమ్యయూప
శ్రేణిన్ మేధీయమై పొల్చిన తురగము రాజిల్ల యాదోమహార
ణ్యానీసంభూతముల్ గ్రామ్యములునుదఱు చైయాగమోక్తంబుగాఁగన్

శా. ఊరుం బల్లెల నుండు జంతువితతిన్ యూపంబులన్ గట్టి నా
రారోకంబులకున్ బిగించిరి సమస్తారణ్యముల్ దీప్తయా
పారూఢంబులు మూఁడువందలు పశుల్ యజ్ఞాత్తమా సంఖ్య శా
స్త్రారబ్ధం బౌక మైదువందలును దా నాపైని బందొమ్మిదిన్ ౩౬౪

ఆ. నేలఁ ద్రాకిపోయి నిలువనిపశువులు
పన్నగాదు లెల్లఁ బంజరముల
బద్ధమయ్యె దీప్తపటుమంత్రకృషశా
మిత్రవేళఁ దురగమేధవేళ

క. ఆరణ్యములను జంపరు
సూరెలయిన యగ్నిశిఖలఁ జూపింతురు చు
ట్టూరం ద్రిప్పుచు విడిచిరి
సూరిమణులు ఋత్విజులు విశుద్ధజ్యోతుల్

తన్వి.
ఆపయి రాజాంగనలును మహిషుల్ హారితనూలతలును విలసిల్లన్
యూపసమీపావని మృతపశులం దోపికతో గుమిఁగొని పరిచర్యం
జూపి శిరోజంబులు కుడిదెసలం జోపి ముడింగొన నెడమను వ్రేలన్
దాఘుచుహస్తంబులఁగుడితోడలన్ దారిదియే మధువుమధువటంచున్

తన్వి.
ఈపగిదిన్ దొమ్మిదితడవలు వారేగి మఱిన్ వెనుదిరిగిరి నట్లే
యూపసమీపావని మృతపశులం దోపికతో గుమిఁగొని పరిచర్యం
జూపి శిరోజంబు లెడమదెసలం జోపి ముడింగొన వలపల వ్రేలన్
దాపుచుహస్తంబులెడమతోడలన్ దారిదియేమధువుమధువటంచున్

క. మూఁడు పసిఁడిసూదులతో
వాఁడిమొనలు వెనుకఁజొఱఁగఁ బశువుల బొమ్ముల్
తూఁడులుగాఁ గాడించిరి
పోఁడిమి నసిపథము లొప్ప భూమిపుకాంతల్

ఆ. ధర్మకామ్యచేత దశరథరాట్పట్ట
మహిషి శవ మటన్న మాట లేక
నిభృతిఁ బ్రాణములను నియమించి కుత్సలే
కలరేయిఁ గడపె హయముతోడ

వ. ఆ దేవితోపాటు తక్కిన రాజాంగనలు నిద్రించి రంత మఱు
నాఁటి కల్యవేళ ౩౭౧

భుజంగవిజృంభితము.

సాధ్వీచూడారత్నం బాకో
సలపతిసుతఁ బెజిజలజాతనేత్రల బ్రహ్మాహో
త్రధ్వర్యూద్గాతల్ వే హస్తా
హరణమునఁ దెమలిచిరి యల్లభోగిని హోత తా
నధ్వర్యుండున్ బాలాకల్యన్
హసదు వనఁగను దగనియట్టి యాపరివృత్తిఁ ద
త్రధ్వాన్జాస్యన్ దా నుద్గా
తయును సతులఁ బతులు కరంబు లూనినయట్లుగా

క. వారివెల లొసఁగి తిరిగి ధ
రారమణుఁడు పుచ్చుకొనియె రామామణులన్
వారివెలయంచు నిచ్చెను
బేరున కా పేరులందు వెల యున్నదియే?

క. ఆ యశ్వారాడ్వపాస్థా
నీయంబయినట్టి తేజనిని నధ్వర్యుం
డాయతిప్రయోగకుశలుం
డై యగ్నులయందు వేల్చి యమరిచి వండెన్

శా. ప్రాణస్పృష్టములౌటఁ బాపములు తత్ప్రాణంబులం బట్టి యా
ఘ్రాణించెన్ ధరణీతలేంద్రుఁడు వపాగంధంబుఁ దద్గంధ క
ల్యాణశ్రీపరిసర్పణోద్ధతులముం దల్లాడి ప్రమగ్గెన్ వధ
క్షోణిన్ దీసిన యీఁకలై చెడు కురుంజు ల్వోలె జీర్ణాఘముల్

క. తక్కిన తురగాంగమ్ములు
ముక్క మిఁగులకుండ హోమముం జేసిరి ఋ
త్విక్కు లవనీంద్రుపాపము
చక్కలమై వడియమై పిసల్లై చెడఁగన్

ఆ. ఇతరయజ్ఞహవిసు లెల్లను బ్లక్షశా
ఖాంతరముల నునిచి యశ్వమేధ
హవిసు వైతసంబునం దుంచి మూన్నాళ్ళ
హోమములను జేసి రుర్వీసురులు

వ. ప్రథమదివసంబునఁ ద్రివృత్పంచదశ సప్తదశైకవింశస్తోమంబులు ద్వితీయదివసంబున నుక్థ్యమును నతిరాత్రంబుఁ దృతీయదివసంబునను బొనరించి యనంతరకాలంబున శాస్త్రాంతరవిహితంబులైన జ్యోతిష్టోమ మ్మాయుషియు నతిరాత్రంబులు నభిజి ద్విశ్వజి దప్తోర్యామ మహాక్రతువులును గావించి యశ్వమేధంబు సాంగంబుగాఁ బూర్తిఁ గావించి నంత

గీ. అలప్రజాపతి సృష్టించినపుడె సర్వ
ధాత్రిదక్షిణ మశ్వమేధమ్ము చేసె
స్వకులసంవర్ధకుఁడును నైక్ష్వాకువంశ
శశియు నిచ్చెను సర్వరసాతలంబు

ఆ. ప్రాచి హోత కిచ్చెఁ బశ్చిమ మ్మధ్వర్యు
నకు నొసంగె దక్షిణంబు బ్రహ్మ
కొసఁగె నుత్తరంబు నుద్గాతకును రాజు
తిరిగి యిత్తు రన్న తెలివిమాలి

ఉ. దక్షిణగాఁగ సర్వవసుధాతల మిచ్చెను బర్వ దింపిన
ట్లక్షుల నప్పళించి భుజ మల్లన నూర్పున నెత్తి దించె స
ర్వక్షితిభారధూర్వహాభవక్లమబుద్ధి ధరాతలేశ్వరుం
డా క్షణమందు సౌఖ్యనివహోత్తశరీరలఘుత్వభావనన్

శా. ఇన్నాళ్ళీ ధర మోసి మోసి బరువయ్యెన్ విశ్వవిజ్ఞానసం
పన్నాళీకభవుల్ భవత్కరములన్ భద్రమ్ముగా నుంచి త
ర్కోన్నేయాచ్ఛపథాధ్వనీనుఁ డగు న న్నో భూసురగ్రామణుల్
మన్నింపం దగు నెప్పుడో తెలిసి సంప్రాప్తించె నీనాఁటికిన్

క. అని యుత్తరీయమును గ
ట్టినదోవతితోడ వడివడిం జను సరసా
లునిత్రోవ కడ్డమై బ్రా
హ్మణు లిదియేమయ్య భూభుజా! భూమకృపా!

చ. తెలిసిన హోమముల్ విధులు దీ క్షహవిస్సులు యజ్ఞవేదికా
దులకొలతల్ ప్రవలిబులును స్తోమము లన్నియు మానిపించి యా

తెలియని కయ్యముల్ జనుల దిద్దుటలుం బెఱజేండ్లు లెత్తు నె
త్తుల కెదురెత్తు లెత్తుటలతోఁ గికురింతువె మమ్ము ధాత్రిపా!

చ. స్మృతికిని దెచ్చుకో తురగమేధము సేయుట యయ్యె నీ కహో
సుతులను గోరి సర్వరిపుసూదన! ధాత్రిభరంబు మాన్చుకో
మతిఁ దలపోసికా దవనిమండల మింతయు నీవయిన్ భవ
త్సుతుఁ డొకఁ డుండి యేలవలెనూ! పెఱవారికి జోక్య మున్నదే?

ఉ. మేదిని యెల్లయుం దొలుత మీది సుమారపుఁజెక్కడెల్ల నా
యా దొర లేల నిచ్చిరి ధరాధిప! యుత్తరకోసలంబులే
మీదగు నేల్బడిం నిలిపి మీ తొలిఱేడులు మీరు ధర్మసం
క్షోదము లేక పైయదుపుఁ జూచుచు నుండిరి సర్వధాత్రిపై

క. మీ రక్తనాళముల నం
భోరుహమిత్రుని సమగ్రములు తేజములుం
ధారావాహికగాఁ జనుఁ
బ్రారూఢములై పరంపరాప్రాప్తములై

క. కొడుకు వదలి పున్నరకము
చెడదే! యదియేమి ముక్తిఁ జేరంగట్టం
గడఁగెదవో? యే యఘములు
కడిగెదవో? యిట్రిత్రోవఁ గంటే? వింటే?

చ. ఇనునిమహస్సు నెత్తురుల నేఁచెడు పుత్రుని ధాత్రి కిచ్చి నీ
వనమున కేగుటో? మొదలివస్తువుఁ గన్బొమలందు నాగుటో?
పౌనరుపఁగావలెం గొనుము భూమి సమస్తము మాకు నేటికిం
జనద మిదే యటంచు మృగచర్మములుం బుడిచెంబు లూనుచుం

క. తారును బ్రాహ్మణులు బయ
ల్దేరిన భూపతియు భూమిదేవుల రం[illegible]
ధారణిసురలారా! నా
ప్రారబ్ధము మీర మీర పాపఁగవలయుం ౩౯౦

క. అని మగుడించిన నా బ్రా
హ్మణులును నీధాత్రి యేల నయ్యా! మా కో
మనుజవిభూ! దృప్తభుజా!
ధనుర్జ్యానిర్గతపృషత్కదారితశత్రూ!

ఉ. ఇత్తు నటన్నఁ బ్రేమ కలదేని నృపా! మణు లిత్తువున్ బసిం
డిత్తువు పాలు పూటకును నిద్దము పిండెడి తొట్టు లిత్తువున్
మెత్తువు నింక నీ తురగమేధము లన్నిట మాకె యార్త్విజం
బిత్తువు దానవీర! వనమేగిన నిత్తువొ పుచ్చుకొందుమో?

మ. అను ఋత్విక్కుల పల్కులం దొడువు మేలై రాజు నప్పాటులుం
దనియన్ రత్నములన్ మణుల్ పసిఁడిముద్దల్ పందవేల్గోవు లుం
డిన మందల్పది యిచ్చి పైఁ బసిఁడినాణెంబుల్ పదాకోట్లు ని
చ్చెను నద్దానికి నాల్గురెట్లగుచు నిచ్చెన్ వెండినాణెంబులన్

చ. కొమరుమిగుల్ మణిప్రతతి గోవులుఁ బైడియు వెండియున్ వశి
ష్ఠమునికి ఋశ్యశృంగున కొసంగిరి వారును గొంచుఁబోయి తా
రమరఁగ ఋత్విగాళి పదునార్గురకున్ బదునాఱు భాగముల్
సమముగఁ జేసి యిచ్చినఁ బ్రశంసలు జేసిరి మానులన్ ద్విజుల్

క. ఇతరులు శ్రుతిస్మృతివిదుల్.
క్షితిసురులకు రాజొసఁగె బసిఁడి నాణెమ్ములన్
మతిఁ దనియఁ గోటి యీగతి
శతక్రతువు గూడఁ జేయఁజాలఁడు నాఁగన్

గీ. ఒక్కపరదేశి నిరుపేద యుర్వీసురుఁడు
కూడి యెకిమీనితోఁ దనగోడు చెప్పఁ
గదలునన వచ్చి తనకు మున్గా మురారి
కరఁగి పతి తీసి యొసఁగె ముంగామురారి

ఉ. దీటుగఁ బూరిపాక మణిదీపిక పెట్టినయట్లు కంకణం
బేటి కొసంగెనో నృపుఁడు నేటికిఁ దాను గ్రహించెనో యెదం
గాటపుదైన్య మొప్ప నవుఁగాదన లేక చనన్ ద్విజుండు ద
ద్ధాటక మిచ్చి పైకొనియె నద్ది సుమంత్రుఁడు ద్వారవీథికన్ ౩౯౨

క. జలనిధి పొంగినదో యన
నలలు నలలు గాఁగ భూసురాశీర్వాదం
బుల రవము చెలఁగె ధాత్రీ
తలపతి గృహతతులు శ్రీనిధానంబులుగాన్

ఉ. సాధుజనైకకంటకనిశాచరకంఠకఠారమూర్తి మా
యాధవుఁ డంజనాద్రిశిఖరాంచలచిక్కణకాంతిమత్తనూ
సాధుమనోజ్ఞమూర్తి త్రిదశప్రభుబంధవిమోచనుండు భూ
మీధవ! త్వత్పురావనసమిద్ధమహానిధియై తలిర్చుతన్

ఉ. ఊనిన మేనిపైఁ బొడుపు లొత్తక మెత్తని క్రిందిపొట్ట పైఁ
గా నొనరించి శ్రీవిభుని కాయము కందనియట్లు చూచు మేల్
పానుపు శేషభోగి నరపాలక! నీదగు భారమంతయున్
దానయి మోచుఁగాక నవతామరసేక్షణభక్తశేఖరా!

మ. అడుగుందమ్ముల శంఖచిహ్నములు దా మంటంగఁ బాణోళ్ళ వ్రే
ల్మిడిఁ బాదూపహచిహ్నముల్ దనువుఁ దాల్చెన్ బాంచజన్యంబు తై
వడి సేవింప ననంగ నే ప్రభువు పంపన్ దక్షిణావర్త మొ
ప్పెడు తేజమ్మది నీ కులంబునను గల్పించున్ యశోదీప్తులన్

క. నిఘ్నము జగ మఖిలము గళ
దఘ్నము దైతేయుభకును దర్పితమదశ
త్రుఘ్నము సుదర్శనము పా
పఘ్నముగా నీయెడన్ గృపంగను భూపా!

క. పతియు వినమ్రశిరస్కుఁడు
క్షితిసురవాగర్థములను జింతించుచుఁ గం
పితదేహయష్టి యాచును
గృతార్థుఁడఁ గృతార్థుఁడ నని కేలు మొగిడ్చెన్

క. ఒకదినుసుది సుఖదుఃఖము
లకు మఱి యాశానిరాశలకు నడిమియొకా
నొకభావముచేఁ బతి గుం
డె కదలి కనుగొనకొలంకు నిండె జలముచేన్

ఉ. శ్రీనిధి నాకసౌధశిఖరిజ్వలితావనినీయమానసో
పానపరంపరాభినవపద్ధతి పావనిదవార్చి య
జ్ఞానతమైన దీప్తఫల మంది ధరాపతి మోదవాహినీ
స్నానము చేసినట్లు తనుసంగతముత్పులకల్ వహించుచున్

ఉ. శృంగమునిన్ సిరన్ గయి ధరించి నృపాలకుఁ డశ్వమేధమున్
సాంగముగా నొనర్చి ఫలసంగతిఁ దెచ్చిన నీ ఋణంబుఁ దీ
ర్పంగలనయ్య? యింకఁ గులవర్ధనహోమము లేమి సేతువో
యంగము ప్రాణ మెల్ల భవదర్పణమున్ బొనరించితిన్ మునీ!

గీ. నాపయిని నీకుఁ బ్రేమ యున్నదియొ లేదొ
సాగిపోనీ కనీస మస్మత్కుమారి
శాంతకును దమ్ముఁడంచుఁ బ్రాసంగువిత్తు
నొకని గనిపింపనీవె మహానిధాన!

క. అనినంత ఋశ్యశృంగుఁడు
తనయులు గలిగెదరు నీకు ధాత్రీతలనా
థ! నలువు రం దొక్కఁడు సూ
ర్యునకున్ సూర్యుఁడు వెలుంగునో మీకులముల్

ఉ. అంచునె ధ్యానమగ్నుఁడయి యమ్ముని యించుక లబ్ధసంజ్ఞుఁడై
ప్రాంచదథర్వవాక్చిరములం దుదితం బయినట్టి రీతిఁ గా
వించెద బుత్త్రికామ మను వేల్మి యటంచును వేల్పుఁజొచ్చెఁ గుం
డాంచల మగ్ని నాలుకల నాని పొడై వెలియారిపోవఁగన్

సీ. కాంతులు దెసలందుఁ గదలించినట్లుగా
పీరులు కత్తుల వేసినట్లు
రోసాన ఝుంఝులు దూసిచన్నట్లుగా
వెలుఁగులు నావిర్భవించినట్లు
కృష్ణరక్తచ్ఛవుల్ క్రేవల వెలయించి
పటహస్వనంబులఁ బ్రజ్వలించి
హార్యక్షలోమవర్ణాభిరామంబులై
క్షితిధరాగ్రోపలోత్సేధములయి

పులులు నాల్కలు సాచినట్టులుగ సాగి
తీక్ష్ణసూర్యాంశువహ్నులు దిమ్మరించి
మానియు నథర్వవేదోక్తమంత్రపటిమ
వహ్ని వేల్చుచోఁ బావకజ్వాల లెగసె

క. పరితోజ్వాలామాలల
హిరణ్యరేతసుఁడు చిటిలి యింధనము శిఖా
భరజిహ్వ చీలి మిన్నులు
పురపుర లేలిహ్యమానములుగా మండన్

క. రాజు ముని యొక్కగొంతున
భ్రాజిష్ణువులైన దీప్తపటుమంత్రములన్
తేజోమయు దమునిని ను
త్తేజితమతులై ధృతిన్ నుతించిరి నుతులన్

అష్టమూర్తి.
అగ్నాయిప్రియతమున్ ని
న్నమితభక్తిప్రపత్తిన్ హవణు పొల్చిన శ్రద్ధా
మగ్నంబౌ హృదయచేతోఁ
మలినమార్గంబునన్ భూమహావిరర్పణకార్యం
బగ్నిప్రథాదులును గర్తల్
హదనునం జేసి బర్హి! యమృతబుక్తతిఁ బాడన్
భుగ్నజ్వాలల వియదాభ
ము లోరయం ప్రాకి బర్హిర్ముఖుల కిత్తు హవిస్సులీ

అష్టమూర్తి.
ఋక్సామాకృతి యజుర్మూ
ర్తిని మహాథర్వవాసున్ గృతసుహవ్యతురంగున్
వాక్సమ్యక్చరదుదాత్త
స్వరితమార్గప్రవిష్టున్ బటుహవిఃప్రియచిత్తున్
దిక్సీమాంతనిబిడజ్యో
తిని బృహద్భాను నిన్నుం దెలిసి స్తోత్ర మొనర్పన్
ద్రాక్సంపాదితములౌఁ ద్రై
దశజగత్సౌఖ్యముల్ నిర్దళనమందు నఘంబుల్ ౪౧౪

పంచచామరము

నమో నమో హవిఃప్రియాయ నాకవాసినాం ముఖా
య మామకీనభక్తితర్పితాత్మనే సురప్రభూ
త్తమాయ కర్మమూర్తయే విదారితాశ్రితార్తయే
నమః కృపీటయోనయే ధనంజయాయ బర్హిషే

క. నీమూర్తి ఋక్కులు యజు
స్సామంబు లధర్వములు నుషర్బుధ! యూర్ధ్వ
శ్రీమహితలోకసంతతి
సోమించును నీకతాన శోచిష్కేశా!

ఆ. శుష్మ! నీవు కరుణఁ జూచుటచేఁ గర్మ
వితతు లెల్ల సాగు వీతిహోత్ర!
నీదు కరుణ వెలయ నెగడెడి జగములు
బర్హి! నీవు కలిమిఁ బ్రభులు సురలు

వ. అని స్తోత్రంబులు పట్టుచుండ నమ్మహాగ్నులనుండి మహాప్రభమ్ము మహావీర్యమ్ము మహాబలమ్ము కృష్ణరక్తాంబరధరమ్ము రక్తాస్యమ్ము దుందుభిస్వనమ్ము స్నిగ్ధహర్యక్షతనుజశ్మశ్రు ప్రవర మూర్ధజమ్ము శుభలక్షణభూషితమ్ము దివ్యాభరణభూషితమ్ము శైలశృంగసముత్సేధమ్ము దృప్తశార్దూలవిక్రమమ్ము దివాకరసమాకారమ్ము దీప్తానల శిఖోపమం బయిన యొక మహాభూత మ్మావిర్భవించిన

క. భూతలపతి భయవిహ్వల
చేతస్కుఁడు వాక్కురాక చేరల కన్నుల్
భీతిమెయి వికచశతప
త్రాతతవిస్తృతములై మహాకృతిఁ జూచెన్

ఉ. ఆగతి నున్న రాజుఁగని యా వెలుఁగోయి నృపాల! నన్నిహా
భ్యాగతునిం బ్రజాపతిసమాగతుఁ గాఁగ నెఱుంగు మన్న రా
జాగతసంజ్ఞుఁడై ద్రుతకృతాంజలియై 'భగవన్ నమోఽస్తు తే
స్వాగత' మేమినే నొనరుపం గల నీ కెఱిగింపు మం చనన్ ౭౨౦

ఉ. అప్పురుషుండు చేతఁ గొనినట్టిది మేల్మిపసిండిచొక్కపుం
గొప్పెర దీప్తపాయసము కూరిచినట్టిది వెండిమూఁతతో
నొప్పెడునట్టిదిన్ దనదు నుగ్మలినాఁ బ్రియమైనయట్టిదిన్
దప్పక చూచి సర్వవసుధాపతితో నిటు పల్కె నంతటన్

క. నీ యర్చాప్రభవిష్ణుత
తుష్టయోషాహృదయనాథ ! సంతోషితమై
యా యమరవితతి పొల్చెడు
నీ యర్చాఫలము లెల్ల నిండించుటకున్

మ. అమృతజ్యోతిరుపేత మియ్యది నృపాలా! అద్యగోదోహప
క్వము సంతానకరం బనామయము పర్వాన్నంబు ప్రాప్తించె ను
త్తముఁడా! భార్యల కిమ్ము దీనిని యదర్థంబై యజింతో తద
ర్థము ప్రాప్తించెడు నారగింపు మనుమీ ధాత్రీశ! నీ భార్యలన్

క. అని ప్రాజాపత్యపురుషుఁ
డును జేఁగొప్పెర నొసంగుఁడున్ బతియు మొగం
బున వినయ మొప్పఁ దలఁతోఁ
బ్రణామ మొనరించి కొనుచుఁ బాయసపాత్రన్

చ. అనుకనుకొంచుఁ గేల్మొగిచి యద్భుతమున్ బ్రియదర్శనంబుఁ దృ
ప్తనయనవీథికాంజనము తత్పురుషాకృతికిన్ బునఃపునః
ప్రణతులు సేసి సంతసము పట్టనిమేనఁ బునఃపునఃప్రద
క్షిణములు సేసి స్తంభమును జెందె నిలంబడి యట్లె చూచుచున్

క. అంతట నవ్వేలుఁగు దిశా
క్రాంతమ్మై యగ్నికంబెఁ గాంతమ్మై దుః
ఖాంతమ్మై సర్వసుఖ
ప్రాంతమ్మై సర్వదృగ్ధురాపటు వయ్యెన్

క. అత్యగ్నికమ్ము ప్రాజా
పత్యపురుషదీప్తి కనులుపట్టకయ లయా
దిత్యశతకోటిదీప్తి
స్తుత్యమ్మై జనుల కనుల నూదులు పొడిచెన్ ౪౨౭

ఆ. కనులు మూఁతపడవు కాంచనేరవు బహి
రంతరమ్ము లోకసమాధి నిద్ర
గ్రుడ్డితనము కాక కుల్యాంబువుల మున్గి
కనులు తెఱచినట్లు కానవయ్యె

వ. అంత

సీ. ముదిపృదాకువుసెజ్జ మునులు జోదిళ్లీయ
హాళిమైఁ గూర్కు సుమాళి యొకఁడు
ప్రామిన్కుచిట్టచివళ్లలో నసురుల
దోరించునట్టి కటారి యొకఁడు
ప్రామట్టిక్రీనీడఁ బారమ్ము ముసలులో
మునులచేఁ జదివించు పోఱఁడొకఁడు
పాలవెల్లికరళ్ళపై వెలికింతలై
కాలివ్రేల్చికెడు కందొకండు
పసిమియై గాలికిని రాలిపడిన యొక్క
నలుసు నివ్వరిముల్లైన వెలుఁగొకండు
స్థూలమై వచ్చి వచ్చి తా సూక్ష్మమగుచు
జనపతికరస్థ మగు పాయసమునఁ జొచ్చె

సీ. అసురకన్యాకంఠహారమంగళసూత్ర
సూత్రకర్తనకేళి సురియవాటు
దనుజవాపీకేళివనసర్వతోభద్ర
భద్రతాహానువుపైఁ బావకోడు
బర్హిర్ముఖాళిసంపత్తివృద్ధ్యాజీవ
జీవమ్ముగాకృష్టి జిగురుఁగండె
మునిధర్మకర్మనిర్మూలనోత్త్యపకంఠ
కంఠదేశములకుఁ గాని దిగులు
నూరిలోకైకకంటకాసురనీతాన
ప్రాణములపైకి నెత్తిన పాముపడఁగ
యగు మహాజ్యోతి యొక్కఁడంతంత వచ్చి
జనపతికరస్థ మగు పాయసమునఁ జొచ్చె

## ఖండాంతము

గీ. శివ! భవత్తనుపూజనమై తవులుఁగాక
బాలకాండేష్టి యిది చంద్రమౌళినృపతి
వినియె నెది సత్యకవివల్ల విశ్వనాథ
పార్వతీశోభనాద్రిగర్భంబు వలన

చ. తొలిచదువుల్ నినుం దెలియు త్రోవలు చెప్పనుజాలవందురే
మలిచదువుల్ ఫలించునటె? మానని తర్కము పెంచిపెంచి చం
చలతమమైన బుద్ధి మతిశాలితయం చనుకోను గాక! ని
శ్చలతమమైన నీదు పదసారసభక్తి నొసంగవే శివా!

మందాక్రాంత.
గౌరీపాదాంబురుహవినమత్కాంతలాక్షానురక్తా!
పారావారోన్మథనజనితప్రౌఢకాకోలభక్తా!
శారజ్యోత్స్న మృదుశశిశిశుస్వచ్ఛచూడాగ్రముక్తా!
సారప్రోద్యజ్జగదవననిష్ణాతగంగాభిషిక్తా! 434



# అవతారఖండము

క. శ్రీవల్గువారిసారథు
నీవేణ్యక్షీణవస్త్రవణీతతిరీటా !
జైవాతృకమంజుకిరీ
టా ! వినవే ! భక్తజనమహోఘచపేటా !

సీ. తనకొప్పు దనుజకామినుల దాపటిచెంప
కును రాచుకొను ముంతకొప్పులందుఁ
దన త్రాఁడు దితిజకాంతల దిస్సఱొమ్ములఁ
దనుకొప్పు పుస్తెలత్రాఁడులందుఁ
దనదైననడుము దైత్యకులాంగనాస్పష్ట
నాభిపల్వలములౌ నడుములందుఁ
దనలక్ష్య మసురనందనవధూనిత్రపా
సంధాననర్మలక్ష్యంబులందు
మూర్తిమన్మత్సరత్వముల్ మొనసియుండు
నే మహాకార్ముకంబున స్వామి చేతఁ
దెరల నింద్రావరజుఁ డరుదెంచె స్వభువు
పతిక్రతుహావిస్సులోఁ దన వంతుకొఱకు

సీ. కౌమోదకీనందకసుదర్శనాయుధ
మ్ములు పనిదీర్చును ముందెపోయి
చీటికి మాటికి శ్రీవరారోహని
విష్టచిత్తుఁడు తన్నుఁ బిల్వఁబోఁడు
అల్పదానవులు ము న్నర్థించినట్టి వ
రంబులు తనదాఁకఁ బ్రాఁకలేదు
తానన్న నితరాయుధములు చాలని యవ
సరముల కగు మహాసత్త్వశాలి

మించిపోయిన రోష్టు కల్పించె నెవఁడు
స్వామి కని యల్లెత్రాట పంచనిది కూడ
ఖంగు ఖంగున మ్రోఁగుచుఁ గదలివచ్చె
స్వామిభుజలంబమానమై శార్ఙ్గధనువు

సీ. నాభిసంస్థములు ప్రాణము లింక నాడునే
యల్పదైత్యులకు దీర్ఘాయువులకు
గళసీమలకుఁ బైని గంతముల్ నిలుచునే
చండాసురులకుఁ బాషండులకును
ఒకఁ డొక్కఁ డూఁది బాహువు లింకఁ జెలఁగునే
విద్యాశరులకు దోర్వీర్యులకును
స్వఃకామినులఁ జెఱపట్టుటల్ సాగునే
చెడిపెరక్కసుల కశృంఖలులకు
ప్రభుమహాయుధమూలవిరాట్టు కదలి
కూడి విజయేందిరోగ్రభ్రూకుటి యనంగ
విధృతమై లస్తకంబున వెడలివచ్చె
స్వామిభుజలంబమానమై శార్ఙ్గధనువు

చ. తన బహుకల్పనిత్యమగు తాపసిరూపున వచ్చియున్న శా
ర్ఙ్గిని తొలివెల్గుబొడ్డు బదరీవనిలో ముదిచెట్టుక్రింది ప
చ్చనివెలుఁగొచు వచ్చుటను శార్ఙ్గధనుశ్చటులోగ్రశృంగగుం
ఫనములు లేనిచో గుఱుతుపట్టియయుండరు సర్వదేవతల్

ఉ. వచ్చిన శౌరి దేవతలు వాఁగులు చుట్టి ప్రదక్షిణించి నీ
పచ్చనివెల్గు మా నయనవారిజకేసరదీప్తి ఱొమ్ముపై
మచ్చ చరన్మధువ్రతము మాహృదయేశ్వర! కెంపుగంబమా
చిచ్చుఱవిల్లు తేనియలు జిమ్మన లేచిన ధారయుఁ ప్రభూ!

సీ. ఓయి హృషీకేశ! దోయిలింతుము నీకు
శార్ఙ్గధనూరాజ! స్వాగతంబు
అనిరుద్ధ! నీకుఁ బాదాభివందనములు
హరివింటిమన్నీఁడ! యంజలి యిది

సంకర్షణా! సమర్చలు నమస్సులు నీకుఁ
గార్మ్యకోత్తమ! నీకుఁ గైమొగుడ్పు
మధుసూదనా! నీకు మంత్రపుష్పము లివ్వి
యద్భుతధనువ! జోహారు నీకు
ఎన్న డెఱుఁగని దర్శనం బిచ్చినారు
తొలిమునిబుజమ్ముపై నొప్పె తొలిధనుస్సు
తొలిమహాసుకృతంబులు తోఁచినట్లు
మరకతశలాక యిది యిద్ది మణిశలాక

సీ. యాగసంరక్షదీక్షాగురుమూర్తి యీ
తొలిబ్రహ్మచారి యుద్ధురత వచ్చె
మునిరూపమంది ఈ మొదటివేలుపుదిట్ట
వైకుంఠరాజ్యమ్ము వదలివచ్చె
ఈశ్రీశమూర్తి యాదృతశివాకృతి మాని
వరమహాలంకారి యరుగుదెంచె
ధర్మంబునే చంకతాళిగాఁ గొని స్వామి
యెడఁద మహాలక్ష్మి విడుపుఁగాంచె
శ్రీవికుంఠమహానగరీమరకత
నిభృతకుడ్యాంశువులఁ దననీడఁ జూచి
యిప్పు డీ స్వామి తన్నుఁ దా నెఱుఁగఁగలఁడొ
యెఱుఁగఁజాలఁడొ యనురూప మెసక మెసఁగె

సీ. అసురమారీకేళిపిశునమై యేపారెఁ
గర్తృక్రియలు రెండుఁ గలసినట్లు
అభయహస్తప్రదానాకృతిం జనె ధను
స్సధికహస్తమువోలె నందగించి
బ్రాహ్మణక్షత్రధర్మపరస్పరాశ్రయ
శ్రమ మొప్పె మునిభుజాగతధనుస్సు
సంకల్పసహితభాస్వత్సచ్చిదానంద
మధుబోధకళ వోలె మలఁగె మూరి

హరిధనుఃఖండసహితమ్మై యవనికి డిగె
నవశబలరోచి ప్రాగ్గగనంపుముక్క
యని సహస్రధా దివిషత్సహస్రముల న
వీనసుతిసహస్రంబు లావిర్భవించె

ఉ. దేవత లట్లు సర్వజగతీపతి వారిజనాభు స్తోత్రసం
భావన చేసి చేసి తమబాధలు జ్ఞప్తికి వచ్చి దైన్యదు
ర్భివికలాత్ములై త్రిజగతీపతిఁ గాంచిరి బాష్పనేత్రులై
తీవలు పూలుఁగా ద్విజగతీపతిమైఁ ద్విసహస్రనేత్రముల్

క. త్రిసహస్రనేత్రములలో
ని సిలుగు లెస రెక్క రెండునేత్రములందుఁ
మసల దివిషదీశుఁడు సా
రసగర్భునివంకఁ బొంగురాఁ గనుగొనియెన్

క. తల కదల లేదు కన్నులు
చలింప లే దమరపతికి జలజాసనుఁ డా
వెలుఁగు లోలయు దారులలోఁ
దెలిసెను దొలిమునికిఁ దెలుప దేవతలిడుమల్

గీ. జలజనాభుని నాభిదేశంబుఁ జూచి
కేల్మోగిడ్చి విధాతృండు కేశవుని ము
ఖంబుఁ జూచి దేవతలముఖంబులు గని
యింద్రుఁ గాంచుచు మునితోడ నిట్టులనియె

క. ప్రభు నన్నుఁ జెప్పుమనెదరు
ఋభువులు దశకంధరాధరీకృత తేజో
విభవులు దినదినగండము
విభు! నూఱేండ్లాయు వయ్యె వీరల బ్రదుకుల్

చ. వరము లొసంగకుండినఁ దపస్సులు చేయరు చేసి రేని గా
పురుషులకుఁ వరా లొసఁగఁబోమని చెప్పఁగలేదు దానఁ గా
పురుషులయందు వానిఫలముల్ విపరీతములౌఁ దపస్సులుఁ
వరములు దైత్యు లీ వరుస స్వర్గసముచ్ఛ్రయశ్రీచ్ఛతా ప్రియాగశ

గీ. అనఁ దురాషాట్టు కలిపించుకొని తపములు
చేయవచ్చును వరములు నీయవచ్చు
నీ యనదరక్కసుల కది యెంత సేప
టికిని స్వర్గముపైఁ జూపలే యనంత!

ఉ. ఇప్పుడటంచుఁ గాదుగద యెప్పటికిన్ స్మృతినుండిపోద నా
కుప్పెనగాలి కూడిపడెనో యన స్వర్గపురీకవాటముల్
త్రుప్పుగఁ జేతికత్తిపిడితోఁ బెడత్రోసి సుధర్మఁ జొచ్చి వాఁ
డప్పుడు చేసినట్టిదగు నల్లరి చూడవలెన్ త్రివిక్రమా!

ఉ. రేపులు మాపులున్ శివునినృత్యముఁ జూచిన తెల్వియంతయున్
జూపుచు నిల్చు నా వెగటుచొక్కులునున్ సురలోకనాథప
త్నీ! పదిమోములన్ బదిరకంబుల నవ్వులుఁ గాంచి నాకహో!
కోపమురాదు నవ్వు నొనఁగూడదు వింతమృగాకృతిన్ జనన్

చ. అపుడపుడే క్షుధాపరిధినై పదిమూపులు క్రుంగునట్లు వ
జ్రపుఁబిడికట్టిచే వికటచంక్రమణంబులఁ జావమోది చొ
క్కపుఁబస దించియుండెదను గాని వరంబులుఁ జేతిలావు సం
ద్రపుఁబొలిమేరలై పయికిరాఁజను పొంగుల నడ్డుకట్టెడిన్

ఉ. ఎవ్వరికాలిగోటికి సహింపరు సామ్యము రాక్షసాంగనల్
గ్రొవ్వున నట్టి యచ్చరలఁ గొంచుఁజనన్ దనయూడిగంబుకై
జివ్వన లాగు ప్రాణములు శ్రీప్రమదామణితోడఁబుట్టువుల్
త్రెవ్వినసంపదన్ బొలసుదిండులయిండులఁ గాంతివాయఁగన్

ఉ. ఆ నరమాంసభోక్తలు నహా! యొక నాగరకంపుజాతియై
హానికి నంట్లుత్రొక్కుట యటంచును బెట్టి యదేమొగాని సం
తానపుఁజెట్లునున్ విఱిచినారు మఱిన్ దిన మేఁతయైనను
లేనిది బక్కచిక్కినదిలే తెఱగంటుల గిడ్డితల్లియున్

ఉ. అన్నిటికేమిగాని వనజాక్ష! వరంబు లొసంగె వేధ యు
త్సన్నులు పెద్దరాక్షసు లజయ్యులె యాటకు నోర్తు వారిలోఁ
జిన్నయు వచ్చి నా నొసటఁ బెట్టునటే యడిదంబు మొన్ననో
నిన్ననో త్రాఁగెనుల్ తెఱచెనే మఱి వాఁడును నింద్రజిత్తటే! ౨౨

ఉ. ఈ మహి యేరుపడ్డ మొద లెందఱు లే రసురుల్ మతేమి వీ
డే మొనలా! పురానముచివృత్తులకన్నను వెల్గఁబెట్టెనా?
ఆ ముసు గల్గువారన మహాభుజదర్పితశౌర్యవృత్తు లీ
గ్రామణియో ప్రతిష్ఠకయికాదు జయించుట సంపదాప్తికై

సీ. మయశిల్పభాక్సుధర్మామహానటశిలా
ప్రతిమలు లంకకుఁ బయనమయ్యె
హరినీలకృతము లైనట్టి నీ ప్రతిమలు
చెవులును ముక్కులుఁ జెక్కఁబడియె
వెల్లేన్గు మునుకలువెట్టు జాహ్నవి మడు
గులు చేపలను బట్టు గుంటలయ్యె
అమ్మ పూజాగృహ మ్మసురసైన్యము ధూమ
పానమ్ము సేసెడు కోనయయ్యె
ఒక్కనాఁడు మాన్మథోత్సవాకృతు లచ్చ
రలను గాంచినంత రామ! రామ!
వెడలుచుండు నాకు వేయియు రెండు క
న్నీటిబొట్లు నిముసనిముసమునకు

ఉ. త్రుంచినపూలతో లతలతోఁ గళవాసిన నందనంబు పో
నెంచము మాటదక్క దటులేగిన నైనను మాదుమాట య
ట్లుంచు తపఃప్రభావగళితోర్మ్ములు మానులు పోయినన్ సరే
వంచన వెక్కిరింపుఁ బడి వచ్చినఁజాలును ప్రాణముండినన్

ఉ. ఎమ్ములు కానిపింపఁ దొలియెమ్ములు నేపులు కొల్లవోవఁగాఁ
గొమ్ములు తిర్గ నయ్యసురకోటిదయన్ సురలోకభోగపు
మ్మమ్మరమంతయున్ వదలిపోయియుఁ బేరునయందు మాఁదులో
కమ్ములరాజటన్నది యొకండె త్యజించదు శార్ఙ్గభీకరా!

శా. ఏచేతుల్ భవదగ్రజాతుఁడయి నే నెత్తన్ బలిశ్రాంతిపోఁ
బ్రాచీనామరలోకనాయకు త్రుటత్పాదంబులం దప్పుడున్
దోఁచుంబో యవియే కరంబులయి నీతోఁబాటుగా యజ్ఞవే
ళాచంచద్ధవి నందుకొమ్మ నెదొ వేళాకోళమో శ్రీహరీ!                    ౨౭

క. ఈచేత యజ్ఞభాగము
నాచేతను గాదు కొనఁగ నా తమ్ముఁడ నీ
వా చెనటి రక్కసుతలల్
రాచెద నని మాటయిమ్ము రాజీవాక్షా!

వ. లేకున్న నేను యజ్ఞభాగమ్మ గ్రహించుట లేదన

శా. అద్దేవుఁ సురనాథు నగ్నియనె దేవా! సర్వహోమంబు ని
న్నుద్దేశించియ చేయఁగాఁబడును నీ వోహో! హవిర్భాగముల్
వద్దన్నఁ మఱి యేరికిం గలుగునో నా యందు వేల్వంగ ని
న్నుద్దేశింపఁగఁ గేశవుండఋనఁ దా నొందుఁ హవిర్భాగముల్

ఉ. ఇత్తురొకో హవిస్సులు మహీసురు లింకను దైత్యకోటికిఁ
మెత్తురొకో ఋగర్థములు మెల్చి పిశాచుల శ్రౌతసూత్రముల్
క్రొత్తలు పుట్టునో మఱియుఁ గ్రొత్తలు పుట్టకయున్నె ధర్మముల్
తుత్తుమురైన వానియెదఁ దోఁచదుగా కది యింత తోఁచినఁ

ఉ ఇయ్యొకయూహ పుట్టునని యియ్యది పుట్టదటంచు నున్న దే!
యయ్యసురేశ్వరేశుని హృదంతరమందున వాఁడు వాఁడుగా
దయ్యెను పద్మనాభుని ప్రధానపుమూర్తిని సూర్యదేవునిఁ
గొయ్యతనంబుమైఁ బనులకుఁ నియమింపఁగ నేను లెక్కయే!

సీ. అతనిగేహము లేమి యాపురంబున నెల్ల
నధమ సేవకుఁడయ్యె నగ్ని యనఁగఁ
జమురు వత్తియు లేక జ్వలియింపవలె దివ్వె
తెలిబూదితో మండవలయుఁ బ్రొయ్యి
యొగి దయవచ్చిన నొకతడికట్టె యం
టింతు రంటింపరు పంతగాండ్రు
రాఁజుదునో నేను రాఁజనో తడికట్టెఁ
దడికట్టెయును లేక తప్పనపుడు
మరల నందునఁ దక్కువ మండుటయును
వనట నెక్కువ మండుట పనికిరాదు
మనసుతోడ నా యంత, నే మండవలయు
నంతలోనె నా యెంత నే నారవలయు

క. నా శోకఁడే ధైర్యము పతి
లోకేశుఁడు తిగ్మరోచి లోకువ కాఁగా
నాకేమి దిగులు? పోనీ
లే! కానిమ్మని యొకండె వృత్రధ్వంసీ!

ఉ. అంతట దక్షిణేశుఁ డను నంబుజనాభ! విచిత్రమైన వృ
త్తాంతము నాది నేను యముఁ డౌటయు నాకు యముండు రావణుం
డింతకు దక్షిణేశుఁడను నేనొ దశాస్యుఁడొ చెప్పలేను ప్రా
ణాంతకమా నిరర్థకదిశాధిపతిత్వము లేల మా కిటన్

శా. ప్రాచీనామరులందు నే పురుగుఁ జెప్పన్ జూడఁగా రాక చా
నే చారా దొక వేళఁ జచ్చినను బోనే పోవఁగా రాదు మే
మా చోటీశ్వరలోక మేగెదరు వా రాహా! పరిభ్రష్టధ
ర్మాచారుల్ బహుపాపకర్మనిరతుల్ ప్రారబ్ధహింసాకృతుల్

క. అది కాదుగాని రావణు
మొదలిబిరుసు లెల్ల దించెఁబో యర్జునుఁ డా
యదరిపడిపోవు టెంతయు
నది యెప్పటి కపుడె క్రొత్త యంభోజాక్షా!

గీ. అన నిఋతి యంతదూర మేలయ్య యే యు
మేశుతో నుట్టికట్టి యూరేగు నితఁడు
అతఁడె తనగిరి నితఁ డెత్తినపుడు కాలి
బొటనవ్రే లొక్కఁగాఁ గనుల్ మిటకరించె

క. అన వాయుదేవుఁ డిట్లనెఁ
దనచంకను నిఱికి యింద్రతనయుఁడు వీనిన్
వనధుల నేడిట మునుఁగన్
దనయూపిరి యాడమికిని నను దండించెన్

క. నే నైదువిధము లందన్
బ్రాణుల దేహంబులందు మసలుదునుగదా!
దానవులమ్మె నెచట నే
నేనో నేనే యెఱుంగనేరను శౌరీ! ౪౦

ఉ. ఊపిరి యాడకుండఁ దినుచుందురు త్రావుచునుందు రంతఁ దా
నై పృథివీపదార్థము దయర్ దన సూక్ష్మతరాణుమధ్యవీ
థీపథమం దొసంగి వెలితిర్ జొఱనిచ్చును నన్ను లేనిచో
నూపిరి యాడకుండుట ప్రభూ! దనుజాళికి నాకొ చెప్పవే!

సీ. సౌధాంతరాంతరస్థలి నేను వీవఁగా
వలెఁ జల్లఁగా వీవవలయు నందుఁ
గడలియొడ్డునఁ జల్లఁగా వీవఁగారాదు
వలసిన స్తంభింపవలయు నేను
నన్ను గుంఫింతురు నవయంత్రముల వని
రాల్పూవతెవులు నా రాపిడంచు
మైరేయపానోష్ణమానినీముఖవాయు
వులు తావివలయు శీతలత వలయు

దానవులకడఁ గత్తెరలోని పోఁక
చందమగు నేను ప్రాణాలు జవుకుజవుకు
గాఁగఁ దప్పించుకొని తిరుగంగ నొదుఁ
గాక నా కొక్కచో నుండగా వలంతె?

క. మధుసూదన! నేను నుష
ర్బుధుఁడును దేవతల మనుట పోయి పదార్థ
ప్రథ మిగిలినాము జ్ఞానాం
బుధిఁ దర్కము ముదురుపాకమునఁ బడి యచటన్

క. ఇటు వేదములను జదివెద
రటుల బృహస్పతిమతంబు నగ్గింతురు నొ
క్కట వారిఁ బట్టవచ్చునె
చిటారుకొ మ్మెక్కినారు శ్రీదర్పితులై

శా. ఆ సిద్ధాంతము లేమిచెప్పుదు హరీ! యన్యాంగనాకర్షణ
వ్యాసంగోక్తుల వారు నూత్నఋషులై యాయామునుల్ నిల్చు వ
న్యాసీమల్ చని రెచ్చిపోదురు స్మృతిన్యాయాదిగ్రంథముల్
రాసుల్ తంపటవెట్టి మానులఁ బత్రగ్రాహులన్ దాఁచుచున్ రసి

క. వలదనినవారు పెండిలి
వలదని తా మాడకుండ వదలుదురో బి
డ్డలఁ గన మానుదురో వా
రలనుం బెంచరొ తమంత రక్షస్సులుగా !

మధ్యాక్కర.
ఒకనాఁడు గౌతము నాశ్రమోద్యాన మొనరంగఁ గాల్చి
ఒకనాఁ డగస్త్యహోమార్చి యుష్ఫని యూఁది చల్లార్చి
ఒకనాఁడు గాధేయు వహ్ని యుముకలో నుమిసి నెత్తురులు
మకిలియా నెఱచియు నించి మత్తిలి మంద్రు రాక్షసులు

గీ. తల్లి చెవులను ద్రెంచెడు దట్టునకును
బిన్నతల్లిచెవుల్ సన్నబీరపూలు
అక్కట కుబేరునకు మొదల్ దిక్కు లేదు
ఇంక మామాట యనవలెనే ముకుంద!

ఉ. వాఁ డఖిలాశలన్ మెలఁగువాఁడయి యీశ్వరు నేమరించి క్రొ
వ్వాఁడితనంబు పేర్చి తన పత్తనవీథిక నిల్పి నల్దిశల్
మూఁడగఁజేయు నంత నయిమూలలు మాడఁగఁజేయుఁ గేశవా!
నేఁడని మెల్లియుం చసుర నేర్చినదానికి నంతమున్నదే ?

మ. అఖిలప్రాణిశరీరదేశములయం దానాభిమూర్ధంబు నే
నఖిలేశా ! చరియింతుఁగాన దనుజోహల్ నన్నుఁబోలన్ జతు
ర్ముఖుఁడున్ నేరఁ డెఱుంగ నయ్యవి క్రియారూపంబులం దాల్చెనా
నఖఘాతంబులఁ దేలిపోవును జగన్నాశంబు సర్వేశ్వరా !

మ. అనిశన్ బ్రహ్మయు నే నెఱుంగుదును గాదా వాయుభట్టారకా!
నను నిందించెదు నేనుగాని దనుసంతానంబు మీమాళిన
ర్తనరేఖావిధురాత్ము లౌటకును జింతం గూరనో? తత్తప
స్సున కే నీయనుబో వరంబు లనఁగాఁ జూ డింత పీలున్నదే?

చ. నిజమున కొక్కమాట నళినీదళనాభ! సురాళి యింక నా
ప్రజ వానరించు దుండగపురాపిడు లోర్వఁగ లేరు తండ్రి! యాఁ
బ్రజవనతద్వ్యథాధ్వగ ముపాయ మొకం డది సన్నిధత్తమై
యజితు లనంగనౌ నసురులందున నిల్చె వరంబువేళనే

ఉ. ఆతఁడు కీశరాజ్యవిభవాతిశయంబునఁ బ్రాణగొడ్డముల్
సేఁతలు సేసెడిన్ వెదకుఁ జివ్వలె నిచ్చలు పైని దానవుం
డాతనికోడె నిప్పు డతఁడై చనుదెంచి సమాశ్రయించినన్
జేత ముదాత్తభావమదశీలముమై దనుజున్ గ్రహించెదున్

గీ. వాలి చెప్పుసేఁతలలోనివారు కీశ
యూథపతులందఱును నిప్పు డుఱుకు మూఱుకు
మంచు పారి దించి పైని సాయంబు సేయ
లేక కైమోడ్పు వెట్టిన లేదు ఫలము

మ. అరికంఠాంతరనాళశైవలగజం బంభోజపత్రాక్షుఁ డా
శరులన్ దానొకత్రోవ యేటికి? యథేష్టంబై విదారించు లా
వరి వా రౌదురు కారు దానవపతిప్రాణంబులన్ దోఁడు దా
గరలేకుండనె సాఁగఁగొట్టుతనువున్ గైకొంట యుక్తంబగున్

శా. శోచిష్కేశుఁడు మీరుచెప్పిన మహాసూక్తుల్ యథార్థంబులౌ
నాచార్యా! యయినన్ మఱొండు గల దాయైంద్రుండు సుగ్రీవునిన్
ద్రోచెన్ రాజ్యమునుండి వాలి సెడినన్ దోడౌను సుగ్రీవుఁ డో
హో! చండాద్భుతశీలి వాలి కితఁ డీడో యందురే నైనవో

ఉ. ఆవల నేస్తమై భటుఁడునై దుముదారును మంత్రి యౌచు సు
గ్రీవుని గొల్చియుండుఁగద కేసరిక్షేత్రము పండు పంటయౌ
పావని యాతఁ డొక్కరుఁడు పట్టఁగఁబగ్గము లేని జోదు శౌ
ర్యావధి కోటియూథపతు లాతని కొక్కనికిన్ సమానమే?

క. ఒకవంద వాలి మేఘ
ప్రకరములకుఁ బవనుఁడైన పవనసుతుఁడు త
ప్పక మనలఁ జేరు దానవ
నికారమున బ్రహ్మచర్యనిష్ఠుఁడు ప్రభువై

ధూమతము.
ఆఁక లేకయ యపాంపతి నైనను దాఁటున్
దోఁకచిచ్చునఁగ రక్కసితుంగ దహించున్
వీఁక యీదృశము లోకము వీరుల కెల్లన్
జోఁక యీతనికి నంజనసూనున కెందున్

క. ఆ కపిపరమేశ్వరుఁ డ
 స్తోకమనీషాపయోధి శుద్ధమతి నవ
 వ్యాకరణవేత్త మోక్షా
 శ్లోకాన్వేషణుఁ డధీతిచూడామణియున్.

క. పవనునకుఁ గిన్క కలుగునె
 యవని నెవరికైన సుతుల యతిశాయిత్వం
 బు వినఁగ మోదమ తండ్రిని
 బవను నుఱఁడు హనుమ వేగపటిమలయందున్.

ఉ. పావని వైనతేయుఁడు జవంబున మూర్తిని మేరుపర్వతం
 బావళియా తదున్ముఖులెయై రణమాడుదు రే సపత్నులం
 చావలఁ బ్రాణ మాసపడనైనది కాదొ! త్రివేళలన్ మద
 ర్చావిధిబుద్ధి యా హనుమ సత్త్వము తేజము నే నెఱుంగుదున్.

క. వాలిదశకంఠు లాతని
 జాలరెటులఁ దిరుగఁదీయ క్షత్త్రకిశోర
 శ్రీలలితాచ్యుతమూర్తిని
 నేలా యెఱుఁగఁడు తపస్వి హృత్కమలమునన్.

చ. హనుమను నగ్నిదేవుఁ డిటు లాడుచునుండఁగ నాదిమానినే
 త్రనిబిడకాంతులుం బయికిరా నఱగన్నుల నప్పళించు స్వా
 మి నిభృతవక్షమం దురల మెత్తనిభూతి మలంచి యూర్పు బి
 గ్గన నిఱియంగఁబట్టి పయికావిని లాగు నురోవృతంబుగన్.

మ. అన నింద్రుం డను నాంజనేయుఁడు సరే యా కీశులున్ బద్మలో
 చను సేవింపకపోవ రందఱు సురాంశప్రోద్భవుల్ గాన, బు
 ద్ధిని వక్రత్వము పొంద రీ గురుని వర్ధిష్ణ్వంశమా తారుఁడున్
 మనపక్షంబునఁ జేరు సౌరగురుసామాన్యాత్తధీశక్తియున్.

వ. అంత వరుణుం డిట్లనియె ధనదునికుమారుఁడు శ్రీమంతుఁడు గంధ
 మాదనుఁడును విశ్వకర్మసుతుండు శిల్పవిద్యాపారంగతుఁడు నళుఁ
 డును బావకునితనూభవుండు సుమ్మసదృశప్రభుఁడు యశస్తేజో
 వీర్యాతిరిక్తసర్వకీశుండు శ్రీమంతుండైన నీలుండును నశ్వినుల

పుత్త్రిలు సౌందర్యద్రవిణవంతులు మైందద్వివిదులును అర్జున్యుని
యంశజుండు మహాబలుండు శరభుండును మనపక్షంబువార యనిన
నింద్రుండు

క. నీకొడుకు సుషేణుని మఱి
కైకొనవేలా యతండు గంధకరికరా
స్తోకభుజాదళితపరా
నీకిని యాతఁడును మనలనే వరియించుక్

ఉ. ఇంకను నప్రమేయబలు లెందఱొ కీశపతుల్ గలారు వా
రంకకు రారు వాలికి నమాంకృతిశాలులు వారిఁజేసి యా
తంకము కల్గుటక్ జనపదస్థులు రక్కసు లంతనంతలోఁ
బొంకము తగ్గి యొడ్డుకొనిపోదురు ఘర్షణదుష్టవేళలక్

సీ. మేరుమందరపర్వతోరువపుష్మంతు
లిచ్ఛానురూపరూపాచ్ఛబలులు
హర్యక్షశార్దూలహారిదర్పోచ్చండు
లుపలపాదపకృతయోధనులును
దంష్ట్రానఖాయుధుల్ దారుణాస్త్రవిశార
దులును యుద్ధాభిలాషులును ఘనులు
తమ జనికృద్దేవతారూపవేషప
రాక్రమసాదృశ్యరంజితాకృ
తులు మహావానరులు నసంఖ్యులు గలారు
ఒక్కఁడొక్కఁడు నెదురైన రక్కసలను
ముక్కలుగఁ జేసి డొక్కలు వ్రక్కలించి
విఱిచి ప్రోవులు పెట్టి కవ్వించుఁ బెఱల

సీ. కదలింతురు నగేంద్రఘనమూలగండముల్
భేదింతురు పురాణవృక్షవితతి
క్షోభపెట్టెదరు నకూపారవార్నాభిఁ
జీల్చివేయుదురును క్షితితలంబు
దుమికెద రుద్భ్రమోత్తుంగపాథోరాశిఁ
జొత్తు రాకాశంపుఁ జూరులందు

పట్టుదు రంభోదపటలి బాహాకృష్టి
గ్రుద్దిచంపుదురు దిక్కుంభివితతి

ఆ దళద్ద్రుస్థలీసింహనాదములకు
భ్రమితమై నేలఁబడు విహంగములగములు
ప్లవగనాథులు స్వప్రతాపప్రతాపి
తార్చిరుద్దామ తేజోమహోపఘనులు

క. వాలి యినసుతుఁడు నళుఁడును
నీలుఁడు హనుమంతుఁడును ననీకినిపతు లు
ద్వేలచరు లఖిలగోలాం
గూలోత్తము లైదుగురను గొలుతురు భటులై

గీ. వాలి రాజును మఱి యువరాజు నినకు
మారుఁడును దక్కుముప్వురు మంత్రు లయ్యె
వాలి సుగ్రీవుఁ దఱుముటవలన నూఱు
లక్ష లగు కీశసేన చీలంగఁబడియె

ఉ. కొందఱు ఋష్యమూకధరకూటము లందున నన్యభూమిభృ
త్కందరపాళిఁ గొందఱు సుఖంబున నుండ్రు వలీముఖుల్ గుహా
ళిందచరన్మృగేంద్రదళేలలీద్విపవన్యలులాయమర్దనా
స్కందిత రేచితోరుపదఘట్టనచండమహాట్టహాసులై

ఉ. వీరలుగాక విస్మయత వేల్పులపెద్దయు నావులించు ధా
టీరభసంపుబిడ్డఁడు కడిందిమగండు త్రివిక్రమప్రభా
వారభటీప్రభాషణహ మప్పుడు మ్రోసెను ఋక్షవాహినీ
ఘోరుఁడు జాంబవంతుఁడును గూడియవచ్చుఁ బ్లవంగసైన్యమున్

క. ఇటు హనుమ జాంబవంతుం
డటు నిద్దరు నిద్ద రొక్కపై దితిజచమూ
ఘటల మృగరాజులటు నిఱ
కటపెట్టుదు రొరసి యొరసి కదిసి యిరుదెసల్

ఉ. ఈ చమువుల్ చమూపతులు నేటికినాఁజను శౌరివిక్రమం
బీ చమువుల్ చమూపతులు నేచిన రాచిన మాచికాయగాఁ
బూచిన నాల్కపూఁతవలెఁ బుప్పొడి రాలి హరింత్రు దానవుల్
కాచవిచిత్రగోళములు గాక స్వయంప్రభ కల్గునే యటన్

క. ఇందున శంకాపంకం
బిందుపగింజంత లేద యీశ్వర! భూభృ
న్మందిరము నీదు శైశవ
సౌందర్యపు వెలుఁగుగాఁ బ్రసాదింపఁగదే!

ఉ. అందఱు నిద్రఁబోవునపు డాత్మపతీ! చనుదెంచి వంతులుం
బొందుచు నెత్తుకొందుమును ముద్దిడుకొందుము మా మొదల్ సిరుల్
జెందియు నక్కటా! వినతిచే సరిపోయిన దెన్నొయేండ్లు నీ
యందము కన్నులుల్ దనువు నాస్యము ముద్దిడ నోచుకొంటిమే?

క. ఇపు డెంచిన దానవుఁడున్
గృపఁగలవాఁడే విచిత్ర కేళీశిశువా
వపువుఁగల నిన్నుఁ గన్నులఁ
గపురారతిధూమ్య గాఁగఁ గ్రచ్చుకొనమటే!

క. అనినంత ననంతాద్భుత
నినాదములు విబుధకంఠనిస్స్రుతి మిన్నుల్
చనినంతఁ దనంతాకా
శనదీభంగోర్మిలాస్యసంపద గలిగెన్

క. సితపుండరీకకన్యక
యతనుజ్యావల్లిరవము నాస్వాదింపన్
జతలేక విడులు గతి వి
స్తృతిఁ బొందెను శార్ఙ్గదృష్టి శ్రీపతియక్షుల్

క. కేశవునికనులు లీలా
శైశవమాధుర్య నిభృతశాంతచ్ఛవులై
కోసల శోణచ్ఛవిను
త్పేశలములు గాగ విధి పవిత్రాత్ముండై

శా. ప్రాణాయామముఁ బూని యంతట నమోవాకంబు లర్పించి గీ
ర్వాణుల్ జోతలు పెట్టుచున్ నిలువ నోపద్మాక్ష! యోశౌరి! యో
వేణీభూతసమస్తబుద్ధివిభవా! విష్ణూ! స్వయంభూ! జగ
చ్ఛ్రేణీభూతనవాంకురాదినవతాశ్రీమంజుబీజాకృతీ!

సీ. అశ్వమేధంబు నీ వా పుత్రకామేష్టి
నీ వధ్వరంబులు నీవ తండ్రి!
యగ్నిహోత్రంబున నావిర్భవించిన
సాద ప్రజాపతిపురుషుండ వీవ
పాయసంబును నీవ పాయసంబందుఁ బ్ర
విష్టమౌ తొలినాఁటివెలుఁగ వీవ
దశరథరాజుకాంతల మువ్వురకును గ
ర్భంబులం దుండు పిండంబ వీవ
రంగురంగుల నడచెడి రాజ వీవ
పంక్తికంధరకంధరాపాటనప్ర
చండచండాంశుచంద్రనిస్తంద్రనేత్ర
ముగ్ధలోకాభిరామరాముఁడవు నీవ

క. అర్ధంబున నొకప్రభువై
యర్ధార్ధంబున నొకండు నా యర్ధము రెం
డర్ధముల నిద్దఱై చన
సార్ధం బగుచున్న పాయసమునకుఁ బ్రణతుల్

ఉ. మళ్ళినయుంగతోఁ గొలకమారిన నిన్ను విరించి యెంచునో?
పాళ్ళుగఁ బంచి వేల్పుపడవాళ్ళు తలంతురొ? యంచు గుండెపై
వ్రేళ్ళుల రాచి బొడ్డు సవరించిన నన్నుఁ దలంచు నీకుఁ గై
కోళ్ళులు కేలుమోడుపులు కోసలరాట్సుతచంటిబిడ్డకున్

చ. శిశువులు సర్వసృష్టిగతజీవసమూహము నాకు నీకు నే
శిశువను నట్టి నిన్ శిశువుఁజేయు వికుంఠరమావిజేతకున్
దశరథభూమినేతకు సుతక్రతుహోతకుఁ దాతతాతకున్
బ్రశమితదుఃఖభూతతతిపక్షమునన్ గయిమోడ్పుఁ బెట్టెదన్ ౧౦౧

మ. అనినన్ శ్రీహరికంఠనిర్గతములై యంభోదగర్జాభముల్
ధ్వను లుద్ఘాతములయ్యె మూఁడుదశలన్ స్వర్వాయువుల్ భూమి డి
గ్గినవై వారితపంక్తికంధరములై క్రీడాత్తసౌఖ్యంబులై
చను నా శార్ఙ్గభుజంగ మా దశల బుస్సల్ కొట్టునా మ్రోయఁగన్

మధ్యాక్కర.
దశరథధాత్రీశగర్భధాత్రి నందనుఁడనై పుట్టి
దశకంధరుని కంఠనాళదళనకృత్యంబునన్ బేర్చి
దశసహస్రాబ్దముల్ ధరణి ధర్మసంధానంబుఁ జేసి
ప్రశమితాసురుఁడనై మీఁదు బాములు బాయంగఁజేతు

మధ్యాక్కర.
అసలైన రక్కసుల్ పేర్చి యధికసురాళి మ్రందింప
వెస పిన్నరక్కసుల్ పిన్నపిన్నలౌ వేల్పులమీఁదఁ
బ్రసరింతు తమబాహుపటిమ వార్వీరిఁ బై చిన్నయెల్లఁ
గసిదీర మర్దింతు దైత్యకంఠసంఘాతంబు లురల

క. ఇదె యభయహస్త మని శ్రీ
సుదతీమసృణాధరంబుసొంపులు మీఱన్
బదనగుహస్తము నెత్తెను
త్రిదశుల యాశాపతాకదీధితి పోలన్

క. ఒకగాలిపెల్లి రివ్వనఁ
జకితమ్మై వచ్చితాఁకి శార్ఙ్గము శంఖ
ప్రకటితతాడనబాధా
ధికసంధ్వానము వెలార్చి దిక్కులు నింపెన్

గీ. అమరకోటి ముఖాంతమ్ము లరుణకాంతి
మెదలి యాకాశమెల్లఁ గిర్మీరితముగ
నందనము మఱలఁ జిగిర్చినదన నెఱుపు
నలుపు రంగులుగా దోరణాలు కట్టె

క. దేవముఖగళితసంస్తుతి
రావము లెసఁగన్ దశరథరాజాగ్ని శిఖా
రావము "లగ్ని ముఖా వై
దేవా"యను తెలివి గలుగఁ దృప్తత నెసఁగన్

క. పరితోజ్వాలామాలల
హిరణ్యరేతసుఁడు చిటిలి యింధనము శిఖా
భరజిహ్వా చీలి మిన్నులు
పురపుర లేలిహ్యమానములుగా మొఱసెన్

చ. క్రమముగ దేవతావళిముఖస్తుతి సన్నగిలంగ నగ్నిసం
భ్రమరవముల్ మలంగెను సురల్ దిశ లేగిన నాల్గుదిక్కులన్
సిమసిమలాడుకొంచు విరిసెన్ శిఖ లంతన చొచ్చె నగ్ని న
శ్రమమున నాగ్నిమూర్తిగఁ బ్రజాపతిపూరుషుఁ డుగ్రరోచియై

చ. జనపతి హస్తమందునఁ బ్రజాపతిపూరుషుఁ డుంచెఁ బాయసం
బును నలపూరుషోజ్జ్వలసమున్నతతేజముఁ జేసి యెల్లభూ
జనుల విలోచనంబులును జాలవు చూడఁగ నల్లసందుఁ గ
న్గొని చొఱఁబాఱెఁ గేశవుఁడునన్ బతిచేఁగల పాయసంబునన్

సీ. ప్రామిన్కుగమిఁ బంటఁబట్టి నీళ్ళలఁ ద్రవ్వ
కొనిపోవు నసుర వెన్కొనిన మీను
శరధిలో మున్న మంథర మాడఁ బైడిప్పఁ
గుదురుచేసిన చిన్ని కూర్మరాజు
హేమాక్షుఁ డను తుంగ నెగచి ముట్టెయును బా
తాళంబు గ్రుమ్మిన దట్టుపోత్రి
స్తంభంబున సకలాంతర్యామితకు సాక్ష్య
ముగఁ జీల్చి వెలలిన మృగవిభుండు
విఱిచి పెరిగించుఁ దననేర్పు వెలయ క్షత్ర
జాతిఁ బోకార్చి వెలయింపఁ జాలుటకును
బరశుధనువులతో మూర్తిపట్టు వెలుఁగు
జనపతికరస్థ మగు పాయసమునఁ జొచ్చె ౧౧౨

సీ. క్షీరాబ్ధితరఁగలో శ్రీపయోధరములో
తొలిపాముపానులోఁ దూఁగుశయ్య
చలువవెన్నెలచాలొ మలయునెండలవాలొ
యగ్గిమంటలడాలొ నిగ్గుచూపు
ప్రామిన్కులచివళ్లొ బహుళసృష్టిమొదళ్లొ
యచ్చతెల్వికరళ్లొ యసలుమూర్తి
తెఱఁగంటుపాళికో దితిజాళిమోళికో
వట్టిన కేళికో వచ్చునటన

ఇల్లు వైకుంఠమందొ మౌనీంద్రహృదయ
మందొ తనదహరాకాశమందొ యైన
చిత్తు నానందమును మించు సత్తొకండు
జనపతికరస్థ మగు పాయసమునఁ జొచ్చె

ఆ. అంత నెల్లజనుల కనిమిషత్వము పోయి
మానవత్వ మల్ల మగిడినట్లు
ఱెప్పలార్చి చూడఁ గొప్పెర చేనొప్పు
రాజొకండె తోఁచెఁ దేజ్రపోవు

చ. మసలని భూమినేత ముఖమండలమం దొక నూత్నదీధితి
ప్రసరణ మొప్ప నాయన కరంబున నొప్పెడు దేవదత్తపా
యసము వెలుంగువాక లెదురై దరికొత్తెనొ పుత్త్రివాంఛయన్
గొసలను దేరి లేఁజివురు గొన్నదొ మాధవచిహ్న మొప్పఁగన్

క. క్రమమున భూమీపతి వద
నమండలము హర్షకాంతి ననలుకొని సభా
కమలసువికాసితరణి సు
షమామనోజ్ఞాంశుభాకషంబుగఁ బొలిచెన్

క. సంతోసపు మధుకుల్యా
సంతానము వెనుకనొత్తి చనుదెంచు తరం
గాంతరపరితోషితమై
యంతఃపురమెల్ల వెల్లువయ్యెఁ దబకలై ౧౧౭

ఉ. వెన్నెలతీవ లల్లుకొని పెట్టిన పందిరినాఁగఁ గార్తికో
త్పన్నసుధాంశుదీధితులు పన్నిన ముగ్గులునాఁగఁ గ్రొంబువుల్
కన్నులువిచ్చి లేసరసి కాచిన వెల్గులునా నరేంద్రునిం
డ్లన్నియు హర్షరశ్మిపట మల్లె వెలుంగులు గ్రుమ్మరించుచున్

గీ. చెఱువులోఁ బూలు చేతులఁ జిమ్ముకొంచుఁ
గడకుఁ జేరంగఁజను నీఁతగాఁడువోలె
నెదురయిన నవ్వు మొగముల యాయకటమున
రాజు నీఁదుచు నంతిపురంబుఁ జేరె

క. అంతఃపురమున భూపతి
సంతసమున నెదురువచ్చు శాంతకుఁ బ్రేమ
స్వాంతకుఁ గనత్కనన్నె
ప్రాంతకుఁ దలతోఁడ మ్రొక్కనట్లుగ మ్రొక్కెన్

శా. అమ్మా! నీ వొకదైవమై వెలసినా వస్మద్గృహమ్మందు నీ
వమ్మానిన్ గొని వెంటవచ్చితివి పుత్త్రావాప్తికై నా కటం
చు మ్మోదమ్మునెసంగఁ బట్టమహిషిం జూపొంద నీ విద్దికై
కొమ్మా! పాయసమంచు నర్ధ మొసఁగెన్ క్షోణీశ్వరుం డామెకున్

క. ఏయించుక యెడమైనను
బాయసముననుండి హరియుఁ బరువెత్తునో నా
నాయమ దీక్షావ్రతనిధి
పాయసమును బ్రేమమిగుల భక్షించె వెసన్

క. ప్రాశనసేసెడు త్వరలోఁ
గౌసల్యాధరము జారఁగాఁ బాయసమున్
గాసంతఁ దుడుచుకొనఁగను
నాసుంతయుఁ దినఁగఁ దల్లి యనుమానించెన్

ఉ. అంతట రాజు శాంతమృదుహాసముఁ జేసెను శాంతఁ గాంచుచున్
శాంతయు మందహాసరుచిసంపదఁ జూపెను రాజుఁ గాంచుచున్
ప్రాంతచరత్త్రిపాలవవిరాజితలోచనవారిజాత శ్రీ
కాంతవిభాసి నవ్వొసఁగఁ గాంచె మహాసతి తండ్రిమాఁతులన్ ౧౨౮

ఉ. నవ్వుచు నేగె రాజు లలనామణియైన సుమిత్రమేడకున్
బువ్వులరారుబోఁడిఁ గనఁబోవక చేఁగలపాయసంబునం
దవ్వరవర్ణినీమణికి నర్ధము వేఁడుగ నేర్పఱించి జా
జవ్వన నూఁగుచి త్తమున సాగెను కేకయరాజపుత్రికై

క. అలచేఁ గలిగినదానన్
జలజాయతనేత్ర కొసఁగె సగము నిలేశుం
డలఘుతరగాఢనిష్ఠా
ప్రలుబ్ధకైకేయి తినియెఁ బాయస మంతన్

క. మగిడి చనుదెంచి కనుగొని
జగతీపతియున్ సుమిత్రఁ జానా! నీకై
సగముంచితినే యదియును
మిగిలినయదియున్ భుజింపుమీ యని యొసఁగన్

ఆ. పట్టమహిషి గౌరవప్రేమభాజన
మొదట నక్కగారు పిదప నేను
నారగింపవలయు ననఁ బతి యాయమ
మున్నె యారగించెనన్న నామె

శా. కౌసల్యాతనుజాతుఁడైన ప్రభువున్ గారామున్మిత్రంబుగా
నై సేవించెడువాఁడు నాకడుపునం దావిర్భవింపంగ నే
నాసింతున్ భవదీయసత్కరుణచే నంచున్ మహాభక్తితోఁ
బ్రాశించెన్ బరిధూతకల్మష సుమిత్రాదేవి తద్భాగముల్

ఉ. ముప్పురు తిన్న వైఖరులు మూఁడువిధంబులుగాఁగ నొప్పఁ దా
నవ్వసుధేశుఁ డూర్పులొలయన్ క్రతువీధికి నేగుదెంచినన్
బువ్వులు నక్షతల్ గలిపిపోసి మహాగ్నుల వేల్మి సాంతమై
నివ్వటిలంగఁ జేసెను మునిప్రవరుం డఖిలార్థవేదియై

ఉ. ఆ నరనాథుఁడున్ మునివరాజ్ఞ మొయిన్ సహసాసమాప్త దీ
క్షానియముండునై స్వగృహసంతతినేగె సభార్యుఁడై ద్విజుల్
మానులు సేవకావళియు మంత్రులు నాపయి యజ్ఞవాటికా
స్థానముఁ జక్కఁజూచి వెలుచన్ గృహమేగి రపేతభారులై ౧౩౮

చ. జనకుఁడు రోమపాదుఁడును సాధులు కేకయరాజు పుత్త్రిఁడుర్
మునిపతి ఋశ్యశృంగుఁడును భూపతిగేహము లేగి రల్లవా
రిని బరిచారకుల్ మతిధురీణతమైఁ బరిచర్యలన్ వినూ
తనముగవచ్చువారల విధమ్ములనఁ దన్పిరి ప్రత్యహమ్ములన్

క. జనకుఁడు ప్రతిదినమును దాఁ
జనెద ననఁగ రాజు రేపు చనవచ్చు ననున్
దినదినము రోమపాదుఁడుఁ
జనెద నన్ రాజు నేఁడె చనవలెనె యనున్

ఉ. వారలు పోదుమంచు నరపాలునితో ననునట్టిపూట ధా
త్రీరమణుండు క్రొత్తసవరించు నపూర్వములైన భోగముల్
వారును రెండునాళ్లు నరపాలునితో నన రిట్లు రోజులున్
వారము లేగ వారు పడవాళ్లను బంపిరి సైన్యయుక్తులన్

మ. యజ్ఞానంతరవేళ రాజు నిలువేల్పౌ రంగనాథున్ బ్రథా
నజ్ఞానాకృతిఁ బూజలొప్ప రఘురాణ్ణానాగృహారామకృ
ద్యజ్ఞశ్రేణులఁ దర్పితుల్ సలిపె నంతన్ బేరుపేరొప్ప లో
కజ్ఞుం డా పతి పేరటాం డ్రనుచు జోఁకన్ గొల్చి మాత్రాదులన్

క. ఏదో యేదో పేరున
భూదయితుఁడు గేహములను బూజాపర్వో
త్పాదన మొనర్చి పోనీ
లే దెవ్వరి నొక్కనెల లలిన్ బందుగులన్

ఉ. అంతట గుప్పుమన్నవి ధరాధిపుగేహములందు ముప్వురున్
గాంతలకున్ నెలల్ మసలు కమ్మనివార్తలు నోటనోట నొ
క్కింత యొడమ్ము పోకముడు లెప్పుడు పొందునొ యంచుఁ జూచు న
క్కాంతముఖాబ్జయా రజకకాంతవచస్సు లుపజ్ఞలై చనన్

క. గర్భపరిరక్షణాశా
నిర్భరులై పుంసవనము నృపసతులకుఁ బ్రా
దుర్భూతగర్భచిహ్నల
కార్భటు లెసఁగంగ సలిపి రంతిపురములన్ ౧౩౮

చ. అరువదివేలయేండ్లపయి నవ్వు డదెప్పుడొ పూలతాఁకుచే
మరణమునొందె నిందుమతి మానవనాథుల యిండ్లు శోకసం
భరితములైన కావి నెడఁబాయవు నాఁటికి నేఁడు రాఘవే
శ్వరగృహముల్ సమూర్జదురరీకృతశోభములై జ్వలించెడున్

ఉ. ఒక్కఁడు కొండనెక్కె మఱియొక్కఁడు నేనుఁగునెక్కె మంత్రులం
దొక్కతె కొండనెక్కె మఱియొక్కతె యేనుఁగునెక్కెఁ బ్రేష్యులం
దొక్కరు నొక్కరున్ గలసి యూరక నవ్వుచుఁ బోవుచుండ్రు రే
దిక్కున మానిసుల్ వసుమతీపతి లోపల నున్నయట్లుగా

క. తా నేగుదునని చెప్పఁగ
నైనన్ జనకుండు వచ్చి యంతర్జ్యోతిః
స్థానమున దృష్టినిలుపుట
తో నిలఁబడ దశరథుండు తోడ్తో నగుచున్

ఉ. మీరలు బ్రహ్మవేత్తలు క్షమింపుడు నాదెస గర్భలేశర
తూరతి మిమ్ము నాపితి సుపర్బుధనిత్యుని నేఁడు పంపెదన్
మీరలు వచ్చి నా తురగమేధము బ్రహ్మపరంబు సేసిరం
చారనిబత్తిమై వినతు లంజలులున్ సలిపెన్ బ్రియంబునన్

ఉ. బ్రాహ్మవిధిన్ సమర్ఘ్యమును బాద్యము లిచ్చి సుదోహనక్రియా
జిహ్మను నల్లకుట్టి నొకచిత్తడిలేఁగటియావు నిచ్చి పై
బ్రాహ్మముగాఁగ వార్చి నెఱబంగరుచీరలు కట్టనిచ్చుచున్
బ్రాహ్మముహూర్తవేళ నృపుఁ బంచెఁ బురాతనచిత్కళాకృతిన్

మ. జనకుం బాసిన నొవ్వు దీర్చి మృదుచర్చన్ రోమపాదుండు వ
చ్చినవా రింద వసింప నేమిచెదునో చిత్తంబునంజూడు! భూ
జనులన్ రాజ్యము మంత్రులం దునిచి నీ జన్నంబు చూడంగ వ
చ్చిన మే మింద వసించినన్ జెడవొకో శ్రీయున్ బ్రజారాజ్యమున్

క. నీ వనుమతించి యొసఁగినఁ
బోవఁగ నేనున్ దలంతు భూమీధవ! యీ
మా వచ్చుట నేఁడైనదొ
రావలవదె మఱలఁ బుత్త్రరత్నముఁ జూడన్ ౧౮౫

వ. అంత దశరథరాజు మఱుమాటాడమి యనుకూలింప మఱునాఁడు
శాంతఋష్యశృంగులతో రోమపాదుండు సామాత్యబంధుపరివా
రుండై ప్రయాణంబు గట్టిన

ఆ. సెలవుగొన్నవాఁడు సెలవుగొన్నట్లుగా
నెసఁగె రాజు ఋశ్యశృంగునొద్దఁ
గౌఁగిలించు నామె కౌఁగిలించినయట్లె
చనియెఁ బట్టమహిషి శాంతయొద్ద

ఆ. దాసి చంకనున్న తనయుఁడు నెగఁ బ్రాకుఁ
దల్లికొఱకుఁ దల్లి తండ్రికిచ్చుఁ
దండ్రి తల్లికిచ్చుఁ దల్లి దాసికొసంగు
సంభ్రమించి రిట్లు శాంతయు ముని

శా. అమ్మా! తమ్ముఁడు పుట్టినప్పుడు సుమంత్రారూఢమౌ మేల్శతాం
గమ్మున్ బంపెద నీవు నీపతియు రాఁగా మాట నీవిచ్చి నా
వమ్మాటల్ మఱువంగఁబోకు మునికాంతా! యంచుఁ గేళీరహ
స్యమ్మున్ గోసలరాజకన్య పలికెన్ శాంతామహాదేవితో

ఉ. కానుక లెత్తు బండ్లు మునుగాఁ జనె వెన్కను వీరు కూడి పోఁ
గా నిలుఁడంచు వారు నల కాలువదాఁకని మెట్టదాఁకనం
చా నిలుచున్న నక్కడ కంపి సరే మగుడంగలార మం
చూనిన ప్రేమభారమున నూర్పిడి యెంతయు దవ్వు చేరుచున్

గీ. ఎట్టకేలకు మగిడిరి పృథ్వీపతియుఁ
బట్టమహిషియుఁ జూతు రా బాటవెంటఁ
బోయెడు రథాలపై నుండి మునియు శాంత
యుత్తలంబునఁ జూతు రయోధ్యవంక

పంచచామరము.

సుమిత్ర రాజుతో నిదేమి చోద్యమో యసుప్రియుం
డు మాని యెల్లకాల మిందునున్ వసించునా యనున్
సుమిత్ర రాణితో నిదేమి చోద్యమమ్మ! శాంత తా
ను మాని యెల్లకాల మిందునున్ వసించునా యనున్ ౧౪౨

గీ. అనుచుఁ దా దుఃఖపడుచు నూరార్చుచుండ
రథములుం జేరె నంతఃపురంబునకును
గాళ్ళు కడిగిరి కట్టఁబ్రనీళ్ళు త్రిప్పి
రంత నింతులు లేఁతచూలెంతలకును

క. కడచిన దినములతో నడ
జడనువడియె లేచుటయును శ్రమ యనిపించెన్
గడకన్నుల వెలుఁగు పొరలు
నడలెను జిఱుతిండి బలిసె జనపతి సతులన్

సీ. చీఁకటిలో నంతచెట్టుగాఁ దోలఁగిపో
యెద వేమిపుట్టనే యెమ్మెలాడి
నీచేతిలో నేదో దాచి యే మెఱుఁగని
యట్లుగాఁ బలికెదే హాసుకత్తె
మంపుగా నంత రెట్టింపయ్యెనే ఔమ్మ
ప్రొద్దుటిప్పటిలోనఁ బువ్వుబోడి
నీవుమాత్రము తక్కువా? వేఁకటిం గాంచి
తొకజాములోపల నుత్పలాక్షి

యనుచు రత్నస్థగితమైన యువనినాథ
సౌధముల మన్నదొరకు టసాధ్యమగుట
ముగురురాణులదాసీలు ప్రమచ్చిలించి
మట్టిబెడ్డలు తెచ్చుచు మఱుఁగుగొంద్రు.

సీ. వచ్చి తానంతలో వచ్చును మఱల భూ
నాథుండు కౌసల్యా సౌధములకు
నిచ్చి యల్లంతలో నిచ్చుఁ గానుకలు సుమి
త్రకు ధరిత్రీనాథుఁ డొకఁడొకండు
మెచ్చి యా మెచ్చులే మెచ్చి యింకొకరీతి
మెచ్చుఁ గైకేయి భూమీధవుండు
వచ్చినవాఁ డట్లె వచ్చిన ట్లుండు భూ
మీనాయకుండు సుమిత్రకడకు

నంతనంతట రాజకార్యములు చూచు
చుండి యుండియు యట్టులే యుఱక లేచి
ముగురు భార్యల నవసౌధముల గడపల
దాఁకఁ బోయి లోనికిఁబోక తాఁకి తిరుగు

గీ. ఎల్లవేళలఁ బతియొద్దనే మెలంగ
వలయు ననిపించు ముప్పురు భార్యలకును
బెతియుఁ దమసెజ్జ నుండిన వాంఛ లేని
వట్టికౌఁగిళ్ళ జబ్బుగాఁ బట్టికొంద్రు

ఉ. చిట్టుముట్టైన కోరుకలు చెప్పఁగ నేటికి తేనితో సిరుల్
తెట్టెలుకట్టువారు తమ తీర్చుకొనంగను లేరొకో? త్రపల్
జిట్టకముల్ ధరాపతికిఁ జెప్పనిరీతిగఁ జెప్పుచుందు రా
జెట్టె సమస్తప్రాణములు హద్దుగఁ దీర్చును వారికోర్కులన్

క. తొలిమోకిలింత లన్నియు
నెలలు గడచినంత తగ్గి నెఱదౌహృదముల్
తొలిపొంగులు నొందులు చెడి
నిలఁబడి తేరిన శరద్ధునీక్రమ మొప్పెన్

వ. అంత నాఱవ నెలయందు

క. సీమంతమ్ములు ముప్పురు
సీమంతినులకును సలుప క్షితిపతియును ని
స్సీమాంతమైన ప్రేముడి
శ్రీమంతుఁడు వారిపజ్జఁ జేరె నెలమితోన్

సీ. వర్షాసమారంభవైభవం బొలసినం
తఁ బయోధరాగ్రముల్ నల్లబారె
శరదృతుప్రారంభసమయాన నూత్నదీ
ధితిఁ బద్మముఖములు తెల్లవడియె
హేమంతహిమపాత మేచి యేచక మున్నె
యంభోజముఖములం దరుచి హెచ్చె
నిశ్శేషము శిశిరానేహ మరుగు దేర
గగనమధ్యమ్ములు కానిపించె

నొగిని వేసంగి వచ్చి పయోధరము ల
దృష్టముగఁ బయస్సులు సేకరించుకొనియెఁ
బక్షమున నెలల్ మసలఁ గన్పడునుగాని
ఋతువు మాత్రము చిహ్ననుమిత మనంగ

సీ. ఒకనాఁడు రోమపాదోర్వీధవుం డంపె
బంగరుచీరలుఁ బండ్లగంప
లొక్కనాఁటికి విదేహోర్వీభృతుం డంపెఁ
బట్టుచీరలు లడ్డు బండ్లకొలది
నొకనాఁడు కేకయోర్వీకళత్రుఁ డంపించె
నగలు నాణెములు సన్నవలిపములు
కౌసల్య కొక్కలేఖయు జరీచీరలుఁ
బ్రత్యేకముగఁ బంపె బడఁతి శాంత
స్వయముగాఁగ నరుంధతీసతియుఁ దెచ్చెఁ
గొడుకగు సుయజ్ఞమునిరాజు పడుగునేయఁ
దాను బేకమునేసిన తళుకుతొగరు
టంచువల్కలములుఁ బండ్లు నాదరమున

సీ. హరినీలమణికృతహారమ్ము లంపు నొ
క్కొక్కసామంతుఁ డొక్కొక్కనాఁడు
గారుత్మతంబులకై పురు లంపు నొ
క్కొకరాజబంధు వొక్కొక్కనాఁడు
సాగరోద్భవరత్నసమితు లంపించు నొ
క్కొకపెద్దశెట్టి యొక్కొక్కనాఁడు
యజ్ఞశేషమ్ము భూపాళిఁ బంపించు నొ
క్కొకసోమపీథి యొక్కొక్కనాఁడు
పురముపెద్దలు సతుల నంపుదురు రోజు
రోజు నూడిద లవ్వారారోహాలును ని
రంత మెరుదెంచి పట్టపురాణులకును
గర్భసంరక్షణోపాయకలనఁ జెప్ప

ఉ. వేదపురంధ్రులట్లు కని పెంచిన తల్లులు పండువగ్గుము
త్రైదువ లేగుదెంచి పరిహాసము ప్రేమయు గౌరవంబు ము
గ్గాదిలిమాటలన్ వరుసఁ గైక సుమిత్రను రాణిఁ బాళ్లగా
నాదలుతీర నాడుకొని యద్భుతశీలలు చూతు రెంతయున్

సీ. తా నదేమో పిచ్చితల్లి కౌసల్య యే
ప్రేమఁబోయిన నదే ప్రేమఁబోవు
శాంత పంపించిన సన్నజరీచీరఁ
బదునేడుదినము లాపగిదిఁ గట్టె
నెందఱు వలదన్న నిది శాంతచీరంచు
నది యుదికించును నదియ కట్టుఁ
దెలివి యరుంధతీదేవి వల్కల మీయ
నాపైని నది తాల్చె నదియ పనిగఁ
బదియునాల్గుదినంబు లాపగిదిఁ జూచి
కొట్టుపట్టిన వని దాచికొనియె దాసి
పట్టమహిషీమహాయోగపరిధులైన
చీర లాపైని దాల్పఁజేసినది దాసి

సీ. శ్రీరంగనాథపూజారాజితవ్రత
దినమును స్నానమాడును దలార
నెలకు మూన్నాళ్లు వానలమెద్దడిని మడి
చీర యారక తడిచీరఁగట్టు
యజ్ఞశేషము వశిష్ఠాశ్రమమ్మునుండి
తినదు సుయజ్ఞుండు తెచ్చుదాఁకఁ
బ్రాశించదును రంగపతి కారగింపైన
వార్త యంచెలమీఁద వచ్చుదాఁకఁ
బర్వదినములఁ జిఱుచాప పైని బండు
కొనును జూలాంద్రుఁరకు నివి కూడదనుచు
మొత్తుకొందురు దాసీలు ముసలివారు
వ్రతము భంగంబుచేయదు రాణిగారు

ఆ. అసలు పూర్వమే మహారాణినీడ సు
మిత్ర యిపుడు మఱియు మీఱిపోయె
నామె యేదితాల్చు నదితాల్చు నెదిచేయు
నామె తానుగూడ నదియచేయు

ఉ. ఇంతటినేమ మొప్పియును నిద్దఱురాణులు సంజవేళ కా
సంత శిరంబుదువ్వి కనుచాయలఁ గాటుకరేక దిద్ది సీ
మంతములన్ గుబుల్కొనెడు మంపుల కుంకుమబొట్టు తీర్ప సీ
మాంతములన్ జిగీషఁ జను నా నృపకాంతల మోహనాకృతుల్

క. ఆకృతి నొంటెకుఁ జెల్లెలు
కైకేయికి ముసలిదాది కలదొక్కతె తా
నేకాలము పతి యచటికిఁ
బోకుండిన దానితోడ మునుఁగును దేల్న్

సీ. నుదుటఁ గస్తురిబొట్టు చదురుగాఁ దీరిచి
ముసలిది వలదన్న మొగము తుడుచు
శ్రీరంగనాథుని సేవింప మడిఁగట్టి
మంథర వలదన్న మానివేయుఁ
గౌసల్యఁ గనఁబోవఁగా బండిఁ బిలిపించి
వగ్గు కాదన్నచోఁ బంపివేయుఁ
గోర్కె సింగారించుకొని పతిఁ గలయఁగా
దాది కిష్టము లేదొ తగ్గిపోవు
తల్లి నెఱుఁగని దోషమ్ము తగిలి కైక
కన్నతల్లిఁ జూడని మమకార మెల్ల
దన్నుఁ జేతులఁ బెంచిన దాదిమీఁద
నొలుకపోయును గుండెలో నులికిపడుచు

సీ. మడికట్టు వలదన్న మంథర మన్నించి
నాతి లోలో రంగనాథుఁ గొలుచు
దాదియొత్తిడి మహాధనచేలములు గట్టి
కాంత కాషాయముల్ కాంక్షసేయు ౧౭౩

ముసలి రత్నాసనమ్మను వీడ నీయమిఁ
బాదుకల్ తోడి పోవఁ బడఁతి యెంచు
నడివగ్గునదుపులు నగ మిష్టమై కాక
యతివ నే నిందుండ ననుచుఁ బలుకు

నెపుడొ మంథరమాటకు నెదురుతిరుగు
నొక్కొకప్పుడు మంథర కొదిగియుండు
నెంతగొడ్డమ్మలైన నాయింతియెడఁదఁ
బ్రభువు శ్రీరంగనాథుండు పాయకుండు

క. సరియైన పెంపకము లే
ని రాచసంతాన మెంత నెగ్గడితనమో?
గరువమ్ము పట్టుదలయో?
సరసమొ మంథరయు నేర్పెఁ జాన కఖిలముఁ

ఉ. ఆ వనితాసిరాపథములం దెసలారుటఁజేసి జన్మతోఁ
గేవలసత్త్వమూర్తి యగు కేకయనాథు నస్ఫ్రుక్ప్రవాహముల్
భావములోపలన్ దెలియఁబట్టనిచోటుల మూలసత్త్వగం
ధావలితంబులై పరిణతాకృతి భద్రములొఁ దదూహాలున్

క. ఇష్టాపతితము వర్ణము
నష్టాపద మంచుఁ బూవుటాడంబరముల్
దృష్టి నిముసమున కోకఁడు వి
శిష్టతఁ గైకేయి పట్టుచీరలు తాల్చున్

క. ఆ హరిణాక్షికి దౌహృద
దోహదములు ముసలి దాది తోడ్తోఁ జేయున్
దేహళి నిలువఁగ నీయదు
కాహళరావమును జెవులఁ గాడఁగనీదున్

ఉ. సంజలఁ బెద్దతల్లులు ముస ళ్ళరుదెంచినఁ జూచిపోవఁగా
రుంజును వృద్ధదాసి యొక రూక్షపుఁజూపున దాని నార్పి ము
గ్ధాంజనలోచనాంతమధురాకృతి దర్శన మిచ్చుఁ గైకయున్
గ్రొంజెలువారుకావి కనుగోనలు నాదరగౌరవంబులై ౧౭౭

ఉ. కాదని యెంతచెప్పినను గైక వినంబడనట్లు పెద్దము
త్తైదువ లేగ మంథరయుఁ దల్లి! యొకానొకకన్ను పన్ను బల్
చేదు లటంచు రక్షలను జేసి పదింబది దృష్టితీసెదుఁ
బూది నొసంటఁబెట్టుఁ గులపూజ్యవశిష్ఠుల యజ్ఞియం బొగిన్

గీ. పెద్దముత్తైదువయు నోర్తు పేర్మి ముగుర
భాగ్యరాసులఁ బొగడికల్ పట్టుచుండ
నృపకుటుంబవృద్ధాంగన లేమొ తల్లి
యాఱుతల లేరుపడనిం డటంద్రు తొలుత

క. చెంబెడు నీళ్ళను నగుచు సు
ఖంబున నా యింత గడచి గట్టెక్కినచో
నంబా! మీదీవనఁ బీ
తాంబరు రంగేశుఁ గొలుతు మందురు వృద్ధల్

వంశస్థము.
లతాంగు లానంద విలాసమూర్తులై
నితాంతగర్భంబులు నిక్కి ముందటన్
బతంగరాట్పంచువుభాతి శార్ఙ్గస
జ్యతాధురావైఖరి నద్భుతంబుగాన్

గీ. చిత్రభానుసంవత్సరశిశిర మేగి
యల స్వభానువసంతంబు నరుగుదెంచె
ముగురు రాణులు కాన్పేడు ముతుకఁ దాల్పఁ
దరులు చివురాకు సన్నముల్ తాల్పఁజొచ్చె

క. జరిగెను మహాయుగంబులు
నిరువదియెనిమిది తలంప నేడవమన్వం
తరము గడచు నీమాదిరి
నిరాళమగు శోభ గల్గెనే మధువేళన్

మధుమతి.
వగరుపిందెలతోఁ జిగురుటాకులతోఁ
దొగరువన్నెలతో మిగిలె మావితరుల్

హంసరుతము.

శ్రీ సంపాదితములై యభ్యాసం బొప్పఁగ సరోజా
వాసంబై మధురవంబై కూసెన్ మత్తకలహంసల్

భ్రమరవిలసితము.

మాకందోద్యత్సుమమధురఝరిణీసేకంబై త్రావి సివము లెసఁగన్
సాకూతం బొప్ప సరసనరఘానీకంబుల్ ఝమ్మని రొద లురలెన్

మత్తకోకిల.

మాధవాగమ మెల్ల లోచనమంజుశోణనవచ్ఛవిన్
సాధులై యెసఁగన్ బికీతతి శ్రావ్యమోహనగీతికా
మాధునిర్ఝరపాళిఁ జిమ్మఁగ మాధవుం డరుణాత్ముఁడై
సాధుధర్మము నెగ్గఁజేసెడి చాయఁ దోఁచిన దెల్లెడన్

గీ. భావి నష్టమసూర్యసావర్ణి మనువు
నంతరమున సప్తర్షిమహావినూత్న
మండలమహర్షి ఋశ్యశృంగుండు వచ్చెఁ
బురిటి కరుదెంచు శాంతతోఁ బొలతితోడ

గీ. తోణికిసల వశిష్ఠారుంధతులును ప్రేమ
లెసఁగ శాంతర్శ్యశృంగుల కెదురుపోవ
నిరుతబిసిజంట యెదురెదు రేగినారు
రెండు మన్వంతరము లెదు రేగినట్లు

ఉ. చైత్రము శుక్లపక్షమున సప్తమినాఁ డరుదెంచె శాంత తో
ర్యత్రికముల్ నినాదముల రాజమహాభవనాంగణోజ్జ్వల
ద్ధాత్రి మనోజ్ఞరావమృదుతాళలయానుగనృత్యదక్షాణు
శ్రీత్రముగాఁగ మోదలహరీబహురీతులు పిచ్చలించఁగాన్

మ. ముని శాంతన్ మునికాంతఁ గన్గొనియె సమ్మోదంబు శ్రీదంబుగాఁ
గని కౌసల్యయుఁ గూతు వౌదువు గదే కల్యాణి! యీనాఁటికా
కనరాఁగా ననుఁ దీరె నీ కను నుడిన్ గౌఁగింటఁదాల్చెన్ మునిం
ద్రునికాంతామణి రాణిగర్భమును జేదూయంగఁ గేల్మోడ్పఁగన్

క. శాంతయు నిట్లనె నీ గ
ర్భాంతర ముజ్జగిలనున్న యద్భుతశిశువుల్

గాంతును నే నెల్లుండియ
యింతకు మును వచ్చి యమ్మ! యేమనఁగలనే?

చ. రహి మును చెప్పె నాకు నుదరంబున నీకును నున్న సామి నీ
దహరములో వెలుంగు దిగెఁ దా నుదరమ్మున దాఁక నంచు మా
ని హరిని జూడవచ్చె నిను నేఁ గనవచ్చితి నేను జూతున
మ్మ హరిని నీవు చూతువు రమాహృదయేశ్వరు డింభ కేశవున్.

శా. హోహో! యేమి హొగడ్త లంచు విసరెన్ బుణ్యాత్మ కౌసల్య శాం
తాపాలీనవిలోచనన్ గలసి యంతన్ జేరి రంతఃపురం
బా పుణ్యాత్మలు కైక శాంత తలపై నానించు కైదమ్మి మే
ల్పాపున్ బోదు సుమిత్ర కాసుదతి వాలుంజూపులం దుండియే

క. క్రమమున ఖగోళమందున
నమరిన గ్రహరాజు లెల్ల నంతంత ససం
భ్రమ మేపారఁగఁ దా రు
త్తమరాశిస్థులుగఁ జన నతంద్రాళువులై

క. పరితస్స్వార్యము నేమి
త్వరావిధృతిఫల్గుఫల్గుతారాపథసా
దర మేదురగమనధురా
పురాణచంక్రమణ మొప్పఁ బోయిరి గ్రహముల్

సుందరి.

శాంతయు వచ్చినదన్న సంబరమందు రా
ట్కాంతలు సప్తమి యెంత గమ్మన పోయెనో?
యంతట నష్టమి వచ్చి యంతన చన్నదో?
యింత యెఱుంగరు శాంత యెంతటి తీపియో?

ప్రభాతము.

తుకతుకనై పడద్రోలి నేడుగుఱ్ఱా
ల కొడుపుముట్టియర్లన్ వెలారు నుత్సల్
చికిలివెలుంగులు చిమ్మెఁ బ్రాచి భాస్వ
త్ప్రకటితసారథిభాక శాంతకాంతుల్

